# SRI BHAKTHA VITOBHA

A TELUGU DRAMA IN FIVE ACTS

BY

K. C. MUNUSWAMY NAIDU

**FIRST EDITION**

PUBLISHED BY

MUNUSWAMY NAIDU & BROS.,

*No. 2/6, Ramanujakootam Street,*

WASHERMANPET,

MADRAS.

1934.



**[Price Re. 1.**

శ్రీ

# శ్రీ భ క్త వి ఠో బా

(ఐ దం క ము ల నా ట క ము)

కే. సి. మునుస్వామినాయుడుగారిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు.

ప్రకటనకర్తలు:

కే సి. మునుస్వామినాయుడు అండ్ బ్రదర్స్,

నం 2/6, రామానుజకూటం వీధి,

చాకలపేట, మదరాసు.

చెన్నపురి: చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1934

 [వెల రూ. 1.

# ప్రకటన.

ఆర్యమహాసోదరులారా !

ఈనాటకము నాచే రచియింపబడి ప్రకటింపబడినది గాన యిందుగల సర్వస్వాతంత్ర్యములు క్రొత్తకాపీరైటు ఆక్టుప్రకారము నాకు జెందియున్నది. కావున దీనిని ఖేలన మొనర్పవలయునని యే సభవారైనను దలచినయెడల నాకు ముందుగా 5-0-0 రూపాయలు పంపుచు నాచే వ్రాతమూలమున రసీదు పొంది నాటకమును జరుపవలెను.

దీనిని భాషాంతరీకరణముగాని, ప్రచురింపవలయునన్నను గాని, నాయనుమతిని వ్రాతమూలముగా పొందక స్వతంత్రించిన నానష్టమునకు పాత్రులగుదురు.

ఇట్లు,

కే. సి. మునుస్వామినాయుడు.

# హెచ్చరిక.

ఆర్యులారా ! ఈనాటకమందుగల పాటలుగాని, పద్యములుగాని, కథాసారమునుగాని, బయాస్కోపు టాకీలుగాని, గ్రామఫోను రికార్డులుగాని నేను యివ్వడమునకు సంసిద్ధముగా యున్నాడను. గాన యెవ్వరేని పై విషయములకు స్వతంత్రించిన వారలు మానష్టములకు పాత్రులగుదురని హెచ్చరించడమైనది.

ఇట్లు,

కే. సి. మునుస్వామినాయుడు



కె. వి. మునుస్వామినాయుఁడు.

# విజ్ఞప్తి.

ఆర్యసోదరులారా !

నేను యీ నాటకమును వ్రాయుటకై గ్రంథపురాణ వ్యాకరణములను చదువలేదు. భగవత్కటాక్షముచేత గలిగిన స్వతంత్రబుద్ధిపూర్వకముగా పూర్తిజేసి కొందరి బాలురకు నేర్పి 1931-వ సంవత్సరము మేనెల 5-వ తేది శనివారమురాత్రి 9-30 గంటలకు మదరాసు ఒత్తవాడ థియేటరులో శ్రీ దేశోద్ధారక విశ్వధాతయగు శ్రీ కాశీనాథుని - నాగేశ్వరరావుపంతులువారి యధ్యక్షతక్రింద నేనే భక్తవిఠోబా పాత్రమును ధరించి యీనాటకమును ప్రదర్శించినాడను. యిందుగల కథాసారమును చూచి పైవారు సంతోషభరితులై మేనెల 7-వ తేది ఆంధ్రపత్రికయందు యీకథాసారమును కొంత ప్రకటించియున్నవారు. యిది చూడవచ్చిన గొప్పవారు కొందరున్ను యీనాటకమును ప్రకటించమని ప్రోత్సహించినందున నేను దీనిని ముద్రింపగలవాడనై దీనియందు వచనకావ్యరూపముగా స్త్రీపురుషులకు గల భేదాభిప్రాయముతోను, వారికి భక్తిగలుగునటుల ప్రాతఃకాలబోధ, మరణబోధ, స్త్రీబోధ, పురుషబోధ, కుటుంబబోధ, శరీరబోధ యను ఆరుఅంశములలో కొంత పురాణవిషయములను, కొంత నా స్వబుద్ధిలోను వ్రాయగలిగినాడను. గాన యీనాటకమును పరిశీలించగలవారెల్లరును యిందేదేని తప్పులుండినను నన్ను మన్నించి, యిందుగల భేదాభిప్రాయములను నాకు తెల్పితిరేని నేను రెండవముద్రణమునందు తప్పులను దిద్ది ప్రచురింపగలవాడనని మిమ్ములను ప్రార్థించుచున్నాడను.

తమవిధేయుడు,

కే. సీ మునుస్వామినాయుడు.

# నాటకమునందలి పాత్రధారులు.

## పురుషులు.

శ్రీవిష్ణు—వైకుంఠనాథుడు.
శ్రీపాండురంగడు—పండరినాథుడు.
శ్రీకృష్ణుడు—ద్వారకానాథుడు.
నారదుడు—దేవముని
దుష్టసింగ్ } రాజ్యాధిపతి, కథానాయకుడు.
భక్తవిఠోబ }
సీనసింగ్—దుష్టసింగ్ కుమారుడు.
దుష్టబుద్ధి—మంత్రి
పండితసింగ్—సైన్యాధిపతి
పప్పుశెట్టి—వ్యాపారి
నరసింహులు—పప్పుశెట్టి గుమస్తా
విష్ణుభక్తుడు }
శివభక్తుడు } భక్తులు.
సన్యాసి. }
4 సేవకులు—రాజభటులు
గోవిందుడు }
కొండడు }
రంగడు }
చెంగడు } పురజనులు
గంగడు }
శేషడు }
బఫూన్—వికటపాత్ర

## స్త్రీలు.

రతీదేవి—దుష్టసింగ్ భార్య, రాణి కథానాయకి
కమల—పప్పుశెట్టిభార్య
సుందరి—చెలికత్తె
డ్యాన్సు—నృత్యగాండ్రు

N. B. ఈనాటకమును పదిమందిచే ప్రదర్శింపవచ్చును.

శ్రీపాండురంగ పరబ్రహ్మణేనమః.

# శ్రీభక్తవిఠోబానాటకము

## ప్రథమాంకము.



(రంగము 1.) దర్బారు.

(దుష్టబుద్ధి, పండితసింగ్, సేవకులు ముందు కొలువుదీరి వుందురు.)

సేవకుడు — ఆస్తేన కదమ్ములు, కత్సే కథం హుడాకర్ దుష్టసింగ్ మహారాజ్కా దర్బార్ నికాల్ రహీహై ఉషార్.

(దుష్టసింగ్ ప్రవేశము)

అందరు:— పాట.

రా—కల్యాణి. తా—ఆది.

ప॥ హేరాజా నుతపూజా
దేవాదినసుర భయతేజా॥ హే॥

అ॥ వీరాతివీర విజయశూర
ప్రాణోపకార విహార-సుధీర-వీరా॥ హే॥

చ॥ దినవశమె తెలసితిమె ధీరుడవై
కరుణతోడ బ్రోవవె ప్రమొక్కెదము॥ హే॥

నటికులు —

రా—హమీరకల్యాణి. తా—ఆది.

జై జై దుష్టా జయ గంభీర-జయ సురపతివీర దుష్టకుమార॥ జై

అ॥ శ్రీకరసారా సాహసధీరా-శూరా సామజశ్రిత వీరా॥ జై॥

చ॥ సురజననుత దుష్టాదికదారి-దుర్జననుత దుష్టాంగన వీరా॥ జై॥
దరమున మేమీ దర్బారందూ-నాట్యంబాడుచు నందముమీర॥ జై॥

(నటికులు నిష్క్రమింతురు)

దుష్టసింగు.—మంత్రివర్యా! యీాలోకమున.

రా—అఠాణ. తా—ఆది.

ప॥ నా సరి యెవరున్నారే యీా సర్వదేశములలో

అ॥ ధరాతలంబుల తరాన నేలెటి దురాత్ములెల్లర బిరానద్రుంచెద॥ సరి॥

చ॥ నిండినట్టిజంతువుల నెడనెడ బొడిబడ
దండిగలవారలను బిండిగను చేసెదను
సురసురాది వరకింకరు లెల్లను
వీరధీర ధరణీశుల నెల్లను
వీరాతివీరులను విరాళిదీసెద
తలాతలంబులు బిరాన నేలెద॥ సరి॥

మంత్రీ! నా భుజబలపరాక్రమమునకు సరి యెవరేనిగలరే ? అటులుండ మనపురంబున యెవ్వరేని యీాహరి శివులంగొల్చు దురాత్ములుందురేని అట్టివారిని గట్టిగొట్టి ఈసభాస్థానంబునకు దెమ్మని భటులకు ఆజ్ఞాపింపుము.

దుష్టబుద్ధి.—చిత్తము ప్రభో.

ఓరీసేవకులారా! యీాపురంబున శివకేశవులను బొగడుచుందుదురాత్ములను గట్టిగొట్టి యీాసభాస్థలంబునకు దీసుకరండు. శీఘ్రముగాచనుడు.

సేవకులు.—చిత్తము ప్రభో. (నిష్క్రమింతురు.)

దుష్టసింగు.—మంత్రీ ! మన పురజనంబులు యేలాగుననున్నవారలో దెల్పుము.

దుష్టబుద్ధి.—దేవా!

గీ. రాజసత్తమ వినుఁడు యీా రాజ్యమందుఁ
ప్రజలు నిరతంబు భవదీయ భవ్యనామ
మాత్మదలపోయుచును నెట్టి యాపదల
బడయకున్నారు లమిత సంపన్నులగుచు.

ప్రభూ! మనరాజ్యంబున ప్రజలందఱు మీయాజ్ఞను శిరసావహించి మీనామమునే దలచుచు సుఖముగానున్నారు. వారెట్టిచింతలొందుటలేదు.

దుష్టసింగ్.—ఆలాగా! చాలాసంతోషము. సైన్యాధిపతీ మనసైన్యములెల్ల శత్రువుల నెదుర్కొనన సిద్ధముగా నున్నారా?

పండితసింగ్ —దేవా తెల్పెద వినుడు.

క. మనసైన్యమెల్ల నిప్పుడు
ఘన దర్ప మెలర్పవైరి గణములనెల్లన్
దునుమాడంగను సిద్ధము
గను నున్నది వినుతమత్త గజవిజయహరీ!

దేవా! మనసైన్యంబునం గల ధీర వీర పరాక్రమవంతులగు యోధులు యుద్ధంబునకు సంసిద్ధులై యున్నవారు ప్రభో!

దుష్టసింగ్ —సెబాష్.

సేవకుఁడు.—(శివభక్తునితో ప్రవేశము)

రా.— మోహన. తా.—రూపకం.

ఫాలశశిధర- నీలకంధర- పరమ శివ శివ శివ శివా!
ఫాలలోచన- ఫణి విభూషణ- పరమ శివ శివ శివ శివా!
కాలకాలా- గౌరిలోలా-కామితప్రద శివ శివా!
పాలితామర దీనవత్సల పరమశివ శివ శివ శివా!

1 సేవకుఁడు.—దేవా! ఈ మూర్ఖుఁడు శివభక్తుఁడట. మేనెల్లయెడలంతయు బూడిదఁ బూసికొని కేల జపమాలయు యోగదండమును బట్టుకొని "శివశివ" యనుచు నొక ర్రమానిక్రిందఁ యుండెను ప్రభో!

దుష్టసింగ్.—ఓరీ మూర్ఖా! నీవెవ్వఁడవు? నారాజ్యవిధానము నీ వెఱుఁగవా?

శివభక్తుఁడు.—అయ్యా! నేను సాధు. నన్ను పరదేశియందురు. నే నచ్చటచ్చటఁ దిరుగుచువచ్చి యిప్పు డిచ్చటివనంబున నివసించి శివుని గూర్చి తపంబొనర్చుచున్నాఁడను.

దుష్టసింగ్.—ఓరీ మూఢా! నాయెదుట నిలచి కొంచమైనను భీతిలేక నోటికి వచ్చినట్లు వదరుచున్నావు. ఓరీ సేవకా వీనినిం దీసికొని పోయి కట్టి కొట్టి కారాగృహంబునం ద్రోయుము.

సేవకుఁడు.—చిత్తము ప్రభో! (అని శివభక్తుని పట్టుకొని పోవును)

(సేవకులతో విష్ణుభక్తులు ప్రవేశము.)

సేవకుఁడు.—రాజేంద్రా యీ పరమచండాళులు మనపురికి వెలుపలనున్న కొలనువద్ద జేరి జపంబులు సలుపుచున్నవారు.

దుష్టసింగ్.—ఓరీ దురాత్ములారా! నారాజ్యంబునగల నీతులం దెలియక మీ రేమి సల్పుచున్నవారు.

విష్ణుభక్తులు.—అయ్యా! మేము యీకొలనువద్ద జపము చేయుచుండ నీ మూఢుఁడు మమ్మీడ్చుకొని వచ్చినాడు.

దుష్టసింగ్.—ఓరీ సేవకా! వీరిం దీసికొనిపోయి కారాగృహంబునందుంచుము.

సేవకుఁడు.—చిత్తము. దేవా! (అనివారిని దీసికొని పోవును)

సేవకుఁడు.—(ప్రవేశము. సన్యాసినిపట్టుకొనివచ్చి క్రిందద్రోయును)

సన్యాసి.—(క్రిందపడి) హా! యిదేటిగతి.

సేవకుఁడు.—దేవా! యీపరమచండాలుఁడు మన పురికివెలుపల నొకగుడిసె యందు రెండు కండ్లులేని ముసలివాండ్లను పోషించుచున్నవాఁడు ప్రభో!

దుష్టసింగ్.—ఓరీమూర్ఖా! నీయూరేది? నీపేరెయ్యది? నీ వెవ్వఁడవు?

సన్యాసి.—(లేచి) రాజా! నాయూరేల? నాపేరేల? నేనెవ్వఁడ నైతే మీకేమి?

దుష్టసింగ్ — ఓరీదుష్టా! నీకీరాజ్యంబున జను లేలాగున ప్రవర్తించుచున్నారో తెలియదా?

సన్యాసి — రాజా! తెలుసును.

దుష్టసింగ్ — అలాగేల నుండవైతివి?

సన్యాసి — అది నావల్ల కానేరదు.

దుష్టసింగ్ — ఓరీదుష్టా! ఇంక నాముందిట్టిమాటల నుడువకుము. నీవు నారాజ్యంబున నడచు విధానంబు నడచుకొందువేని సరి. లేనిచో ఈ ఖడ్గముచే నీ శిరంబునుం ద్రుంచెద. జాగ్రతసుమా. (అని ఖడ్గము చూపును)

సన్యాసి — రాజా. మీబోటివా రిట్లుండఁదగునా?

సీ. రాజశేఖర నీవు క్రూరాత్ముఁడవయ్యు
ఘోర ఖడ్గమున నన్ను గొట్టవలదు
స్త్రీహత్య బ్రహ్మహత్య శిశుహత్య మొదలుగా
గోహత్య పసిబాల గురునిహత్య
హరిహరి దుష్టంబు లరయ గర్వంబుచే
భక్తుల హింసించు పాతకులను
అతిదుష్ట రాజులై న్యాయంబు లెఱుగక
తలలు ఖండించేటి తామసులను

గీ పట్టి యమపురికి దోడ్కొని కట్టికొట్టి
కొర్తపై వేసి చూతురు కొంతసేపు
యిట్టి వెతలును నీకేల యిపుడు నన్ను
వదలితే నీకు వైకుంఠ పదవిగల్గు.

దుష్టసింగ్. — మంత్రీ ! చూచితివా వీనిగర్వము. కొంచెమైనను భీతిలేక నాకుం బుద్ధిగరపుచున్నాఁడు. ఓరీ దుష్టా! ఏమి? నీ మమకారము. నాముందు జూపుచున్నావు. ఛీ! చనుము. (అని కాలితో దన్నును.)

సన్యాసి. — (క్రిందబడి) హా! తలిదండ్రులారా!

# భ క్త వి శో ఖా.

రా—కాపి. తా—చాపు.

ప॥ హా యిదేటి కాల మహిమో ఏటి వింతయో

అ॥ హేయమైన స్థితిని గూర్ప న్యాయమ దేవా॥ హా॥

చ॥ ముసలి తల్లి దండ్రులను నండ బాపనే

గతి యింకెట్లో మానసంబు కలత జెందెనే॥ హా॥

హా నే నెంతటి నిరపరాధిని. హా జగద్రక్షకా! యీదుష్టుని చే జిక్క నిచ్చి నన్నిటి కష్టంబుల బెట్ట దగునా? హా! నాతలిదండ్రులం గా పాడువా రెవ్వరు? నన్ను రక్షింపుము రక్షింపుము దేవా.

దుష్టసింగ్.—(సింహాసనము దిగివచ్చి) ఓరీదురాత్మా! నీనోరాడు నటుల నన్నుం దూషించుచున్నావు. ఇదిగో చూడుము ఈ ఖడ్గముచే నీశిరముఖం డ్రుంచెద. (అని కత్తి ఎత్తును.)

సన్యాసి.—హా జగద్రక్షకా! కాపాడుము కాపాడుము.

నారదుఁడు—(ప్రవేశము) బాలకా! భయపడకు. భయపడకు. (అనికత్తి పట్టుకొని) రాజా తాళుము. తాళుము యిదేఁటికార్యం బొనర్చెదవు? ఈబాలుని వదలుము. అటుదూరముగా చనుము.

దుష్టసింగ్.—మునీంద్రా! నమస్కరించుచున్నాను.

నారదుఁడు—రాజా! నీవు నమస్కరించినందులకై నాశీర్వదించెదను గాని, యీ పరమభక్తుఁడగు బాలు నిట్లు జేయనేల తృణీకరించినాఁడవు?

దుష్టసింగ్—ఆర్యా! నారాజ్యమున నిట్టి దురాత్ములుండనీయక యిట్లు జేయుచున్నాఁడను.

నారదుఁడు.—రాజా! యిదేఁటి వింత?

సీ॥ పుడమిలోన నినుఁబోలు బుద్ధి విహీనుల
 నవనీతలమునందు నరయ నెందు
నిరతంబు హరిపద సరసిజంబులగొల్చు
 భక్తుల హింసింపఁ బాడి యగునె



దుష్టసింగ్ సన్యాసిని సంహరించబోవ నారదులు ప్రత్యక్షమగుట.

కటకట యిటుసేయఁ గడుపాతకం బని
యించుక మదినేల నెంచవైతి
దుష్టుల శిక్షింప శిష్టుల రక్షింప
హరియొక్కఁడున్నాఁడ టనఁగ వినవె
గీ. ఏల యీలీల నించుక జాలిలేక
చంపఁజూచెదునీతనిఁ జాలుచాలు
అతిధులను సాధులను బట్టి దునుమువారు
నిరయమును గాంతు రనుమాట నీవు వినవే?

ఓరాజా! వింటివా, లేశమాత్రమైనను న్యాయము గుర్తెఱుంగక నీ లోకంబున తలిదండ్రులచెంతను, గురువుల చెంతను, పృధ్వీపతులచెంతను, దప్పక యపరాధులై యుండిన నుండవచ్చునుగాని, యిట్టి సాధువులగు భక్తుల చెంత నపరాధము జేయ నోపఁదగునె ? యిట్లు ప్రవర్తించుటచే నీ వంశమునకు కీడును, ముక్తికి విరక్తియును, నరకప్రాప్తినిం బొందవే ? యిది యెఱుంగని నీయట్టి దుర్బుద్ధులుంగలరే ?

దుష్టసింగ్.—నాదుర్బుద్ధులం బోగొట్ట నేతెంచిన యోమహాత్మా! ముక్తియనునదేమి? నరక మనునదేమి ? ఆవిశేషముల నాకుం దెల్పుము

నారదుఁడు.—రాజా! నీమతికి చాలా మెచ్చితి. తెల్పెద వినుము.

సీ. ధరలోన నరజన్మ మెత్తి నప్పటి నుంచి
దాసుడై హరిస్మరణ సేయవలయు,
భువిలోన భక్తుఁడై బుట్టి నప్పటి నుంచి
భక్తుల నెల్లను బ్రోవవలయు,
రాజాధిరాజవై రాజ్యంబునేలుచు
రఘురామ ధ్యానంబు సలుపవలయు,
యెన్నడు మరువక యేచింతలనులేక
భక్తితో హరిగోరు భక్తులకును
గీ. ఎట్టికష్టములు రాక వెరపులేక
బ్రోచుచుండును శ్రీహరి ప్రీతి దెలిసి,

యిట్టిహింసలు బెట్టక నింపులోఁడ
హరిని ధ్యానింపు మిప్పుఁడవనిలోన.

దుష్టసింగ్.—ఆర్యా! అతని నేలాగు నుతింపవలెను?

నారదుఁడు—రాజా! సమస్త అండాండంబులు, తన రోమాంశముస నిండించుకొని అజహరాదుల కాదిమూర్తుఁడై వెలయు శ్రీహరి ధ్యానము తేపతేపకు "హరి హరి" యని బలుకుచుందువేని సకలపాపంబులు నివర్తియగును.

దుష్టసింగ్—దేవా! మీరు 'హరి' యని నుడివినమాత్రమున నామన స్సేదో యొకవిధమైన సంతోషము బొందుచున్నది. అది యెట్లు నుతింపవలెనో, నేతీరున నుండవలెనో తెల్పుఁడు?

నారదుఁడు—రాజా! అటులైన నీవమిత పాపంబులం జేసియున్నాడవు. ముదిత వంతుఁడ వైతివి. నీవీరాజ్యమును నీకుమారునకుఁ బట్టాభిషేకం బొనర్చి కొలదిరోజు లరణ్యమున కేఁగి శ్రీహరినిం గూర్చి తపంబొనర్చితివేని, నీపాపములు నశించి నీకు శుభము గలుగును.

దుష్టసింగ్—ఆర్యా! అటులైన నీశుభదినంబున మీచేతులార నాపుత్రునకు పట్టాభిషేకం బొనర్పుఁడు.

నారదుఁడు.—అలాగే కానిమ్ము.

దుష్టసింగ్.—మంత్రీ! నాపుత్రునిం దోడ్కొనిరమ్ము.

దుష్టబుద్ధి.—చిత్తము ప్రభో. (అని నిష్క్రమించును)

దుష్టసింగ్.—దేవా! ఆసన మలంకరింపుఁడు.

(నారదుఁడు, రాజు, కూర్చుందురు.)

నారదుఁడు—రాజా! మరచితిని. కారాగృహవాసుల విడిపించుము.

దుష్టసింగ్.—ఆర్యా! ఆలాగే విడిపించెదను ఓరీ సేవకా! నీవు కారాగృహమునకువెళ్లి అందుండగలవారిని విడచిపెట్టుము.

సేవకుఁడు.—చిత్తము దేవా. (అని నిష్క్రమించును.)

(ముందు సేవకులు, ఒకడు తట్టలో పూలహారము వస్త్రములను,

ఒకఁడు కారాగృహవాసులను తీసికొని వచ్చెదరు.)

సీనసింగ్.—(ప్రవేశము)

రా—కాపి. తా—ఆది.

ప॥ శ్రీరమణా నీసన్నుతి నమ్మి దినినే విడరా॥ శ్రీ

అ॥ మన్ననాతో బ్రోవరార మంచివేళరా యిదేరా

చ॥ భారమా నన్నుబ్రోవ భక్తపాల భావ్యసుశీల వరదా
నీరజనయన నేరమేమి నీలఘనరూప ఇదేరా
పన్నగశాయినాదు పాలిదోరబాలుని మొర వినరా
చిన్నివాడనంచు నాపై చిన్నిచూపేల వరదా॥

(అని తండ్రివైపుకు వెళ్లి)

క. ఓతండ్రి నీకు దండము
బీతరనన్నిటకు బిలువ నెయ్యది కతమో
ప్రీతినెరింగింతు రేనియు
చేతో మోదం బెలర్పఁ జేసెదనిపుడే!

తండ్రీ! నమస్కారము.

దుష్టసింగ్.—తనయా! శుభంబగుగాక. అదిగో గురువర్యులకు నమస్కరింపుము.

సీనసింగ్ —(నారదునిప్రక్కకుతిరిగి) గురువర్యా! నమస్కారము.

నారదుఁడు —బాలకా! చిరంజీవగుగాక.

దుష్టసింగ్.—ఆర్యా! ఇక పట్టాభిషేకం బొనర్పుఁడు.

నారదుఁడు —బాలకా! సింహాసనంబునం గూర్చుండుము.

(అని కూర్చుండబెట్టి అందరిచేత పుష్పాక్షతలునిచ్చి, సీనసింగుచేత కత్తినిచ్చి శిరంబున గిరీటముందాల్చి, కంఠంబున పూలహారమువేసి.)

సీనసింగ్ మహారాజుకు జై!

(అని యందరుచెప్పి పుష్పాక్షతలుం జల్లవలెను.)

రాజా! సేఁబోయెదను.

దుష్టసింగ్ —(నారదుని మెడయందు పూలహారము వేసి) ఆర్యా! నమస్కరించుచున్నాఁడను.

(ముందు తెరవాలును.)

నారదుఁడు.— రా—జెంఝూటి. తా—ఆది.

గోవింద దామోదరా నారాయణా గో॥
శ్రీపతి కేశవ సింధుగంభీర
పాపతిమిరహరణ నారాయణ గో॥

[అని నిష్క్రమింతురు

# ద్వితీయాంకము.



(రంగము. 1.) రాజాంతఃపురము.

(రతీదేవి, సుందరి ప్రవేశము.)

రా—కల్యాణి. తా—రూపక.

రతీదేవి.—ప॥ వందనంబు భరతమాత వందనంబు సుగుణపూత
అ॥ వందనంబు వీరమాత వందనంబిదో తల్లి
చ॥ మాతయైననిన్ను నేను మరచినట్టి పాతకనులు
భూతలంబునందు నిన్ను బొగడ గల్గెనె తల్లీ॥ వం॥
ఏనొనర్చు పాపమెల్ల నిపుడునిన్ను దలచినంత
, లోననాశమయ్యె నమ్మ మీననేత్రి నిజము సుమ్మ. వం॥

సుందరి.—అమ్మా ! అదిగో, తమ పుత్రుడు వచ్చుచున్నాఁడు.

రతీదేవి— రా—బ్యాగు. తా—ఆది.

రారా ! నాబాల, కుమారా-రాజితగుణశీలా
కాలున గజ్జెలు ఘల్లునమ్రోగ-రారానాతనయా
గుణ శీలా రారానాబాల-కుమారా
రారా నాపుత్రా, రారానాతనయా-కుమారా రాజితగుణశీలా.

(తనయుని నెత్తుకొని ముద్దిడి)

తనయా ! ఎచ్చటికిఁ బోయియుంటివి అదిగో తండ్రిగారు వచ్చుచున్నారు. చూడుము.

దుష్టసింగ్ —(ప్రవేశము)

రా—మాల్‌గోస్. తా—ఏకం.

ప॥ ఓరాఘువా నను బ్రోవ నీకింత తామసమయా ఓ॥

అ॥ ఈలోకమందు నీవెగాక యెవరు నన్ను బ్రోచువారు ఓ॥

చ॥ భూలోకమందు నేను బుట్టినప్పటినుండి శ్రమలు
పడ్డపాటుగాని సుఖము బడయనైతి ఏమిసేతు ఓ॥
అలనాడు విభీషణుండు ఆర్తి ! శరణటంచు వేడ
ప్రియముతోడ బ్రోచినట్లు వేగనన్ను గావరాదె ఓ॥

దేవా ! నిన్నే నమ్మినాను. (అనిరతీ దేవివంక తిరుగును.)

రతిదేవి —ప్రాణనాధ ! నమస్కారము

దుష్టసింగ్ —సఖి ! శుభం బగుగాక.

రతీదేవి —నాథా ! మీ ముఖారవిందమును చూచిన మాత్రమున నామనస్సునం దొకచింత గలుగుచున్నది.

దుష్టసింగ్ —దేవీ ఏమియులేదు. మహాత్ములగు నారదమునివర్యులు నిన్నటి దినంబున నాకొక విషయముం దెల్పిరి. అదిమొదలు నా మనంబు దానియందే లీనమైనది. అయ్యది యెట్లు నీకుఁదెల్పుదును.

రతీదేవి —నాథా! అయ్యది యేదియో దాని నాకుం దెల్పి నన్ను కృతార్థురాలిం జేయరాదా ।

దుష్టసింగ్.—ఓ సుగుణభూషణీ ! వినుము. మునివరుండు నన్ను తపంబొనర్ప జనుమనియె. కావున నేనీరాజ్యంబు వదలి యరణ్యంబునకేగి శ్రీహరినింగూర్చి తపంబాచరించి యా పరమాత్ముని చే వరంబులం బడసి వచ్చెద. నాకు సెలవిమ్ము ప్రియా !

రతీదేవి—హా! నాథ ! ఏమంటిరి ? తపస్సునకై యరణ్యంబునకుఁ బోవలెనా ? అయ్యో ! ఇదియేటి తలపు ? ఆనారదునకుఁ బట్టినపైత్యము మీకుం బట్టినట్లున్నదే ? నాథా ! ఇందులేనిభక్తి యందేలాగు లభించు

ను. అయ్యో! ఆ ఘోరమైన యరణ్యంబున కేగి తప మాచరించఁబోయితి రేని మాకు దిక్కెవ్వరు? మమ్మాదరించువా రెవ్వరు! అయ్యో! నాథా! వలదు వలదు. పోవలదు.

దుష్టసింగ్ — కాంతా! ఇదేటిమాట?

రతీదేవి — నాథా! అట్లంటి రేమి?

దుష్టసింగ్ — దేవీ! ఇదేటివింత తెల్పెద వినుము.

(దుష్టసింగ్ రతీదేవి తర్కము)

రా—జంఝూటి తా—చాపు.

దుష్టసింగ్ — సఖి! ఏటికి ఈరీతి తెల్పెదవు ఈ వసుధయందు
సర్వంబుఁగల భూతజీవుల ఎవఁడుపోషించె॥

రతీదేవి — నాథ! ఇట్టిబుద్ధులు మీరుదెల్పుట నాకర్మ మేమో
మీరిట్టు దెల్ప మిమువిడిచి మేము ఎట్లు బ్రతికి ధాత్రియుందుము॥

దుష్టసింగ్ — సఖి! పుట్టుటె మరిగిట్టుటె వడిగట్టుటె పలుజన్మమె
గీపట్టుదల నాబ్రాతఫలమంటె నీ విట్లుదెల్ప
సఖి! నాతిబుద్ధులు నేడు విడిపించు॥

రతీదేవి — నాథ! ఏటికీబుద్ధులు పుట్టించె ఆ హరిమీకు
నాకర్మవశము యీ రాజ్యఫలము ఏమిసేయుదు
తెలియనాయనుగా

దుష్టసింగ్ — సఖి! తెప్పునసీరాజ్యమున నే దుష్టుఁడై జన్మించితి అనితప్పక
హరిభక్తిలోముంచె నీ పుణ్యవశము యీ రాజ్యఫలము
హరినిబాసి యెటులనుందునే!

రతీదేవి — తగునన విడనాడిపోవుట ధర్మంబెమీకు
ఈరీతిఁదెల్ప నాథ నాటిబుద్ధులు నేడు విడిపించు.

అయ్యో, నాథా! మీరే తల్లితండ్రి గురుదైవంబని యెంచి యను దినము మీపాదసేవ చేయుచున్న యీ యబలను విడనాడి యరణ్యంబు నకేగ తమకెట్లు మనసొప్పెను? అట్లు మీరు విడనాడిన యెడ మమ్ము రక్షించువారెవరు? ఇది తామెఁగరా! నాథా! వలదు వలదు.




దుష్టసింగ్ రతీదేవివద్ద తపస్సు కేగవలని దెల్పుట.

దుష్టసింగ్.—సఖి ! ఇంక నేల యిట్లనెదవు? చెప్పెదను, వినుము.

శ్లో. మాతానాస్తి పితానాస్తి, నాస్తి బంధుసహోదరః,
అర్థంనాస్తి గృహంనాస్తి, తస్మాత్ జాగ్రత జాగ్రతః.

అను చందంబున భార్యయేడ? బిడ్డలేడ? బంధువులేడ? భ్రాతలేడ? నీవెవ్వరవు? నేనెవ్వడను? ఎవరి కెవరు? ఇవన్నియు నీవు గుర్తెఱింగిన విషయమేకదా! అట్టితపంబుకన్న రాజ్యంబెక్కువాయెనా? ప్రియా! నీవు చింతింపకుము. నేఁబోయి యా భగవదనుగ్రహము బడసితినేని, నీకుం భర్తనై యతనికి దాసుఁడనై యెప్పటి యట్ల సుఖస్థితిం బొందెదను. నీవు చింతింపకుము. ఓరీసేవకా ! మంత్రిం దోడితెమ్ము.

(అని రాజు లోనికివెళ్లి కాషాయవస్త్రములం దొడిగి
కమండలము, రుద్రాక్షలు చేతంబూనియుండును)

సేవకుఁడు — (ప్రవేశము) చిత్తము దేవా.

రతీదేవి—అయ్యో ! నా నాథుఁ డెంతఁదెల్పినను వినకున్నారే. నేనేమిచేయుదాన? ఈజాలి కెట్లోర్చియుందును?

(అని కూర్చుండును)

దుష్టబుద్ధి—(ప్రవేశించి) దేవీ ! నమస్కారము. ప్రభువుగా రెం దున్నారు ?

రతీదేవి—మంత్రీ! ఆగుము వచ్చెదరు.

(దుష్టసింగ్ కావిఅంగీతో ప్రవేశము)

దుష్టబుద్ధి—దేవా! నమస్కారము.

దుష్టసింగ్—మంత్రీ! నే నరణ్యమునకేఁగి భగవంతునిఁగూర్చి తపం బాచరించబోవుచున్నాఁడను. గాన నీరాజ్యంబు నీవశంబున నప్పగించె దను నేనువచ్చువరకు నీవు రాజ్య మతినీతితోన్లు, సత్యముదప్పక, ప్రజల హింసింపక, నాభార్యాపుత్రుల కెట్టికష్టములు గలుగనీక నతిజాగరూకుఁ డవై పరిపాలించుచుండుము. నేఁ బోయివచ్చెదను

దుష్టబుద్ధి—ప్రభూ! తమయాజ్ఞానుసారము ప్రవర్తించెదను. అం దుకు తాముయోచింప నక్కరలేదు. మీరు శుభముగావెళ్లి తపమాచ రించిరండు.

[దుష్టసింగ్, దుష్టబుద్ధి, రతీదేవి తర్కము]

దుష్టసింగ్—(ముందునకు వచ్చినట్లువచ్చి మంత్రినింజూచి)

రా—ఆనందభైరవి. తా—రూపకం.

దుష్టసింగ్—మంత్రి శేఖరా నీవు మరువకుండు మయ్యా
అంచితముగా రాజ్యంబు నీ వాదరింపుమయ్యా॥

దుష్టబుద్ధి— రాజశేఖరా మీరు రాజ్యమువచ్చువరకు
అతినీతితో రాజ్యంబుని ఆదరించెదను॥

దుష్టసింగ్—మంత్రీనాదూ సతిపుత్రుల నెమ్మదిగాజూడు
వారినే కష్టంబుల బడవేయకుమయ్యా॥

దుష్టబుద్ధి—యోచింపకు యోచింపకు యోచింపకుమయ్యా
వారినేకష్టముల పాల్ జేయను దేవా॥

దుష్టసింగ్—(రతీదేవినిజూచి)
సఖీ! పోదునిదో పోదునిదో పోయివచ్చెదనే
పోదునిదో పోదునిదో పోయివచ్చెదను॥

రతీదేవి— నాథ! మీరు నన్ను బాసి న్యాయంబెపోవ
పుత్రునైనా కండ్లజూచి పోవలదేనాథా॥

దుష్టసింగ్—(పుత్రునెత్తుకొని)
పుత్రా నీవూ పూజ్యుడవై పుడమి నేలుమయ్యా
నిత్యమును నీతల్లిని నెడబాయకుమయ్యా॥

సీనసింగ్— చింతింపకు చింతింపకు చింతింపకుతండ్రీ
చింతింపకు మీపాలిట శ్రీరాముడుగలడు॥

దుష్టసింగ్—పోదునిదో పోదునిదో పోయివచ్చెదను
పోదునిదో పోదునిదో పోయివచ్చెదను॥
(అని పుత్రుని క్రిందవిడిచి పోవుచుండ)

రతీదేవి— (అడ్డగించి)

రా—బిలహరి. తా—రూపకం.

నాథా! మనసేల కరుగదు నా మొరనువినియు॥ నాథా॥
ఈధాత్రిని మీరునన్ను విడిచిపోవనగునే॥ నాథా॥

దుష్టసింగ్.—సఖి! యిటులేల బల్కెదొ. సర్వేశుడొక్కడుండ సఖి॥
నెమ్మదినొందక నీవిటు నన్ను యిట్లు ఆపదగునే సఖి॥
తోహర.

రతీదేవి.—నాథ! నన్ విడనాడి పోవనౌనా
న్యాయంబె ఈదుఃఖ చింత

దుష్టసింగ్.—సఖి! వీటికి దుఃఖంబు విడువుమా
పరగునన్ నే బోయి తరలివచ్చెద శుభముగా.

(అని నిష్క్రమించును.)

రతీదేవి.—హానాథ! (అని మూర్ఛిల్లును.)

సుందరి.—(విసరుచు) అమ్మా! లెమ్మ. రాజుగారు రాగలరు. ఏలదుఃఖంచెదవు?

రతీదేవి.—(దుఃఖించుచు లేచి)

రా—అసావేరి. తా—ఆది.

ప॥ ఏరీతిన్ నన్ బాసిపోతిరో
యెటులను ప్రాణములను భరియింతును॥

అ॥ కన్నపుత్రుని కాంతను విడిచి
కాననభూముల కాలెటు లిడుదురో॥ ఏ॥

చ॥ సర్వేశ్వర సంకటంబులెల్ల దీర్చి నా
ప్రాణవిభునిబ్రోచి నన్ను పరగ కావుమా॥ ఏ॥

(అని నిష్క్రమించును.)

(తెరవాలును)

(రంగము 2) అరణ్యము.

దుష్టసింగ్.—[ప్రవేశము]

(పంచవర్ణచిలుక అను వర్ణమెట్టు.)

రా—మాండు. తా—ఆది.

ఆధారమునీవే ఆదరించుచురారా శోధన చేయకురా శ్రీరామ
సోదరుడని బ్రోవరా ఆ. ఆ. ఆ. ఆదార॥

తంత్రి యానతిగొని తపసి యాగమువీర్చి
ఆహల్యను బ్రోచితివే శ్రీరామ
ఆవిధి నను బ్రోవుమా. ఆ. ఆ. ఆ. ఆదార॥
మిథిలాపురంబు కేగి శివుని విల్లుద్రుంచి
సీతను పెండ్లాడిన శ్రీరామ
చింతలు దీర్చుమయ్య ఆ. ఆ. ఆ. ఆదార॥

హా! దేవా! ఇదో నీదాసుఁడను, సర్వము వదలి ఈ యరణ్యంబునకువచ్చి నిన్నుగూర్చి తపం బాచరింపఁ బోవుచున్నాఁడను. గాన నాకు మీదివ్యదర్శన మొసంగి నన్నుంగాపాడవలయును ప్రభో.

రా—కాపి. తా—ఆది.

రామ రామ రామ సీతారామ రామ
రామ రామ రామ సీతా రామ రామ
రారా రారా రాం
(పాడుచు కొండపైకిపోయి తపస్సేయుచు గావలయును.)

తెరవాలును.

(రంగము. 3) అరణ్యము.

(ఇద్దరు సెనగకాయలు మూటఁ గట్టుకొని,
గోవిందుడు శేషడు ప్రవేశము)

గోవిందుఁడు.—ఓరీ. శేషా! నీవీదిన మెంతకూలీ దీశావురా ?

శేషఁడు —అయ్యా ! నేనా, ఇదిగో చూడు. ఈ సెనగకాయలు 1, 2, 3, రూకలు చేశాను నీవెంత దీశావు చూపు?

గోవిందుఁడు —నేనా, ఇదిగో రెండుసోలిగెలు సెనగకాయలున్నా, నాలుగు రూకలు దీశారా.

(అని ఇటునటు జూచి)

ఓరే కొండఁడెక్కడ ఇంకారాలేదు?

శేషఁడు.—వాన్కి కూలింకా యీలేదురా.

గోవిందుఁడు.—ఓరోరి కొండయ్యా. (అని పిలుచును)
కొండడు.—ఓరి? గోవిందా! ఉంర్డొస్తాను.
(అని ప్రవేశించును.

గోవిందుఁడు.—ఓరీ! ఇంతసేపేం జేశావురా?
కొండడు.—యజమాని కూలి స్తేగదంట్రా!
గోవిందుఁడు.—నీకెంత కూలిచ్చార్రా?
కొండఁడు.—ఇదిగో రెండురూకలిచ్చార్రా.
గోవిందుఁడు.—అదియట్లుణ్ణే ర్రాత్రినీవేడ బోయావురా?
కొండఁడు.—నేనా చెప్తాయిన్రా!

రా—కాపి. తా—అట.

ప॥ ఆవ్రూరు వారొచ్చి ఆవ్రూరువారొచ్చి
అ॥ ఆటలాడుచుంటె అక్కడపోయుంటిరా
గోయింద యిక్కడ రాకుంటిరా
చ॥ ఆటయొద్దకుబొయ్యి ఆటయొద్దకుపొయ్యి
అందరు చూస్తుంటె ఆడనిద్రపోతిరా
గోయింద ఆడనిద్రపోతిరా
నిద్రలేచిచూడ నిద్రలేచిచూడ
నీరయ్యె నావొళ్లు ఇంకేమిచెప్పుదురా
గోయింద నేనేమిచేతురురా.

అయ్యా! నేను ర్రాత్రి ఊరి ఆటకుపోయి ఆడపడి నిద్రపొయ్యి లేచి చూసేసరికి యెవ్వరులేదు. చీకటిచేత భయపడి నావొళ్లు వొనుకు బుట్టి పరిగెత్తి యింటికి బోతినిరా.
గోవిందుఁడు—ఓరీ, శేషా! నువ్వేడ బోయుంట్రా?
శేషుడు—నేనా, చెప్తాయిన్రా!

రా—కాపి. తా—ఆది.

ప॥ కూలొచ్చిన దుడ్డుతీసి కుండనిండ కల్లుగొని
అ॥ కోర్కెదీర నేనుత్రాగి నాను ఓరీ గోయింద
చ॥ కైపు తలకెక్కి ఒడలుత్రిప్పె తత్తరపాటు
బుట్టె నాకండ్ల కూను

యేటికి త్రాగినానొ అకల్లునేను చాలా
కైపు బుట్టినయ్యా ఓరీ గోవిందా
కూటము చేయుచుంటి నా రేయి యెల్ల
కూడులేక వస్తువుంటి ఓరీగోవిందా.

ఓరయ్యా! నేనురాత్రి కూలొచ్చినకాసు తీసుకొనొప్పోయికల్లుతాగి కైపెక్కి రేయెల్ల నిద్రలేక అయ్యో ఆకిలికి దాళలేక అబ్బబ్బ అమ్మమ్మ అని అసొక్కన నిక్కుచుంటి రోరయ్యా.

కొండఁడు—ఓరయ్యా! నీవు బలేపెద్దమనిషివిగాని అట్లుండుము (అనిగోవిందుని జూచి) ఓరీ గోయిందా? మమ్మడిగేవుగాని నీవేడ బోయుంటివిరా?

గోవిందుఁడు.—ఒరే యెట్టినాయాల నన్నడిగేవు చెప్తాయిన్రా?

రా—తెమ్మాంగు. తా—ఏకం.

ప॥ ఇంటిలో బిడ్డలు ఈదులాడు చుండ
అ॥ బైటనుభార్య బాదుకొనుచుండ
దుత్తలో కానెత్తుక ఓరీ కొండఁడా
కల్లంగిటికిఁ బారిపోతిరా

చ॥ కల్లంగిటికిఁ బారిపోయి కల్లంగిటికిఁ
బారిపోయి కడుపునిండా కల్లుఁదాగి
కైపెక్కి నేనో స్తిరా
నాఇంటికి కదలకుండ పండుకొంటిరా.

ఓరీ కొండా! మూఁడుదినాలుగా ఇంట్లో బిడ్డలు బువ్వలేక వస్తుంటే నేనెన్నో యేండ్లుగా దుత్తలో రెండురూకలు దాచిపెట్టుకుంటిని. ఆ రూకలెత్తుక పోతుంటె నాపెళ్లామొచ్చి బిడ్డ లాకలి కల్లాడుతుండారనగా నేనుయినక దాని త్రోసివేసి కల్లంగిటికి పారిపోయి కడుపునిండా కల్దాగి యింటికొచ్చిచూడ బిడ్డలేడుస్తుండ నేను వాళ్లనిమూడక యీదులోఁబడి నిద్రపోతినిరా.

కొండఁడు—నువ్వు బిడ్డల కన్నంబెట్టక కల్దాగితివే చాలాపెద్దమనిషివే నీ మాటలచేత పొద్దొతాది మీరు కల్లంగిటికి వస్తారా ఏమి?

గోవిందుడు—నేను వస్తానురా.



దుష్టసింగ్ కు శ్రీహరి ప్రత్యక్షమగుట.

శేషఁడు—కానిరా. బిన్నే పోయొస్తాము రంద్రా.

కొండఁడు—అవును రంద్రా బిన్నే పోయి తాగి అన్నంతిని పనికి బోదాము. (అని నిష్క్రమింతురు.)

తెర వాలును.

(రంగము 4) అరణ్యము.

(దుష్టసింగ్ దీర్ఘతపస్సు-శ్రీహరి ప్రత్యక్షమగుట)

శ్రీహరి.—వీనిభక్తి చూడ నతిచోద్యంబై యున్నది. వీనిచే భూలోకంబున సకల జనులకు భక్తిఁగలుగునట్లుఁ జేయవలెను.

(అని రాజును జూచి.)

క. ఓయీ భక్తశిఖామణి
యీయెడ నీభక్తికేను నెదమెచ్చితిచాల్
నీయుగ్రతపము విడిచను
మా యిచ్చెద ముక్తికొన్ని వాసరములకున్॥

(అని నిష్క్రమించును.)

దుష్టసింగ్.— (కండ్లుదెరచి అటునిటుఁజూచి) హా! ఇదేటిచోద్యము! నాతపస్సు విఘ్నమొనర్చినవారెవరు? కలయా? లేక నిజమేనా? కాదు కాదు నిజమే ఇప్పుడు నాముందువచ్చి యింక కొలదిరోజులలో మోక్షంబిచ్చెదనని దెల్పినవారెవరు? హే పరంధామా! నాకేలమోక్షంబియ్యవైతివి. ఇంక ఈదుష్టుఁడెన్ని కష్టములం బడవలసి యున్నదో హా! నేనేమి చేయుదును? (అని ఇటునటు జూచి) అదిగో నారదమునీంద్రులు వచ్చుచున్నారు. వారికిఁదెల్పెదను.

నారదుఁడు. (ప్రవేశము.)

రా—హిందుస్తాని కాపి. తా—ఆది.

ప॥ నిర్మలాకార నిఖిలాధారా!
అ॥ నిత్యకల్యాణా నిరుపమశీలా!
నీలదేవా శ్రీలోలా గుణశీలా!
జయబాలా గోపాలా!

దుష్టసింగ్.—(కొండదిగివచ్చి) గురువర్యా! నమస్కారము.

నారదుఁడు.—నీకు శుభంబగుఁగాక. రాజా! నీము ఖారవింద మును జూచినమాత్రమున నీ తపస్సు సిద్ధించి నట్లున్నది.

దుష్టసింగ్.—దేవా! మోక్షంబియ్యఁడాయె గదా!

నారదుఁడు—రాజా! నీవలన సకల జనంబులకుఁ భక్తిఁగలుఁగు నట్లున్నది. గాన నీవు భక్తగోష్ఠి గూర్చుకొని ఈ కలియుగంబున వెలయు చున్న శ్రీ పండరీ క్షేత్రంబున కరిఁగి శ్రీపాండురంగని సేవించి వచ్చితి వేని నీ పాపములు దొలఁగును. ఆ పరాత్మ రూపుఁడగు భగవంతుఁడునీకు మోక్షంబియ్య గలఁడు కాన నీవు శీఘ్రముగ జనుము. నేటి మొదలు నీవు భక్తవిఠోభా యను నామముతో వెలయుదువుగాక.

భక్తవిఠోభా—ఆర్యా! తమయాజ్ఞచొప్పున భక్తులంగూర్చికొని యీ పండరినాథుని దర్శించి వచ్చెదను. నాకు సెలవొసంగుడు.

నారదుఁడు—రాజా! నీవు సుఖముగాఁ బోయిరమ్ము.

భక్తవిఠో.—మునిచంద్రా! నమస్కారము.

(అని నిష్క్రమించును)

నారదుఁడు—(భక్తవిఠోబా వంకఁజూచి, తనలో) నీనిభక్తిఁజూడ నతిచోద్యంబుగా నున్నది ఇంకనుంజూచెద.

రా—హిందుస్తాని కాపి. తా—ఆది.

చ॥ సకలోద్ధారా సద్గుణశీలా సాధునిరంజనలోలా
కరిపాలా వేణు లోలాగోపాలా.

(నిష్క్రమించును.)

(తెర వా లు ను)

# తృతీయాంకము.

(రంగము 1) కల్లు అంగడి.

(గుమస్త సుబ్రహ్మణ్యం అంగటి యందు కూర్చొనియుండుట)

చెంగయ్య.—(గుమస్తవంకజూచి) సుబ్రహ్మణ్యం అంగడి తెరచి బోణి ఆయినదా?

సుబ్రహ్మణ్యం.—లేదండి.

చెంగయ్య.—అయితే యీాదినమేమి కిస్తీకట్టేదిరా?

(అని యంగటి యందు కూర్చుండును)

(గంగడు రంగడు ప్రవేశం)

గంగడు—ఒరె రంగా! యిదో కల్లుదాగి బోదాము రారా!

రంగడు—(అంగటివద్దకు పోయి) అయ్యా! రెండు ముంతలు కల్లు బోయవయ్య.

చెంగయ్య—ఒరే డబ్బు యెత్తండిరా?

గంగడు—యిందయ్య నీ డబ్బు కల్లు బోయవయ్య.

(అని ముంతలెత్తి కల్లు ద్రాగి.)

ఒరే చూచావురా యీా కల్లు యెంత్త సోగ్గ వున్నది. దీనికంటె యింక సోకు యెకె తెలుసునా? చెప్తయిను.

రా—హిందుస్తాని బ్యాగు తా—ఏకం.

ప॥ సారాయిసోకుర దానికంట నల్లమందు సోకురా భల్

అ॥ సారాయిత్రాగినోడు స్వర్గలోక మెల్ తాడు
నల్లమందుతిన్నోడు నాగలోక మెల్లుతాడు॥ సారా॥

చ॥ కల్లుని దాగినోడు కైలాస మెల్ తాడు
అన్నము తిన్నోడు దున్నపోతౌతాడు॥ సారా॥

వ. అబ్బ! యేమిర కన్ను త్రిప్పుచున్నది యింకా కల్లుత్రాగతాము రాండ్రా. (అని కూర్చొని కల్లుత్రాగుచుందురు.)

భక్తవితో—[ప్రవేశం]

రా—అసావేరి. తా—ఆది.

ప॥ నీవేగతినాకు రంగ రంగా॥ నీవే॥
అ॥ దీనదయాళా దీనునిఁబ్రోవ రంగా రంగ రంగశ్రీరంగా॥ నీవే॥
చ॥ తల్లిదండ్రిగురు దైవము నీవె
తనయునిఁబ్రోవను తరలిటురావే
తండ్రినే నీకా దద్దయువేడ
తామసమేటికి దాసునిఁబ్రోవ॥ నీవే॥

హే పాండురంగా! ఓ పద్మనాభ ! యీ అరణ్యంబు నెందువెదకి నను యెవరు కానరాకున్నారు. నేనెట్లు మిమ్ము సేవించగలను (అని అటు నిటు కల్లుఁత్రాగువారిని జూచి) ఆహా, యిందెవరో యున్నవారు. వీరిని చూడ అతిపామరులై, బుద్ధిహీనులైయున్నారు. వీరెట్లు నావెంబడి రాగలరు. అయినను యడిగిజూచెదనుగాక. (అని వారిప్రక్కబోవుచుండ)

(గోవిందుఁడు, కొండఁడు, శేషఁడు ప్రవేశం)

గోవిందుఁడు —ఒరే రండ్రా కల్లుదాగి పోతాము.
కొండఁడు.—అవును రండ్రా చాలా పొద్దయింది.
భక్తవిఠో!— (వారికి అడ్డముగా పోయి)
అయ్యా మీరెందు బోయెదరు.
గోవిందుఁడు —ఓరే యీనెవండ్రో (అని యందరు నిలచిచూచి)
ఒరే, యీనెవ్వరో సన్యాసి లాగున్నారు.
కొండఁడు.—అయ్యా ! యిందేల వచ్చారు. కల్లుదాగతారా.
భక్తవిఠో.—అయ్యా ! నాకు కల్లు అక్కరలేదు మీరిందేల వచ్చితిరి ?

కొండఁడు.—అయ్యా ! మేము కయ్యలో సేద్యాలుచేసి కల్లు దాగి పోదామని వచ్చాము.

భక్తవిఠో.—అయ్యలారా ! మీరు యీకల్లుని ద్రాగవచ్చునా. యిందుచేత చాలా కష్టములు గలుగుచున్నదని మీరెరుగరే.




భక్తవిఠోబా పురజనులను కల్లు త్రాగవలదని బోధించుట

(కండిత హోటిలోనిరో)

రా—ఇశా అసావేరి. తా—రూపకం.

ప॥ ప్రజలార కల్లు నెపుడు త్రాగబోకుడు
అ॥ త్రాగబోకుడు సారాయి త్రాగ బోకుడు.
చ॥ కల్లు సారాయి చేత కష్టము లొాదవునయ్యో జ్ఞాన
సంపదలెల్ల నీటఁగల్పును నీటగల్పును ధైర్యం పీట బుచ్చును
తోహర॥ ఆలు బిడ్డలు నన్న దమ్ములు నన్నమో యని యేడ్పు
చుండగ చూచి వారిని దూషించు నట్టి యీ కల్లునుమీరు త్రా॥

అయ్యలార! ఇందువలన బ్రతివారు కష్టపడుచున్నారే మీరిట్లు త్రాగవచ్చునా !

శేషుఁడు—అయ్యా ! (అని కల్లుముంత చేతికెత్తుకొని) ఈకల్లు ముంతను విడువ మనెదరా ? అయ్యో ! కల్లుముంతా ! నిన్నెట్లు విడుతునె.

రా—ఇశా బ్యాగ్. తా—ఏకం.

ప॥ కల్లుముంత నాయమ్మ నిన్నెట్లువిడుతునె॥ క॥
అ॥ కష్టపడి మేమువచ్చి కల్లునిద్రాగి యీ
కల్లంగడినివేగ కొల్ల బెడుదు మె॥ క॥
చ॥ యేడాదికి నొక పండుగొచ్చితె బోగిపండుగొచ్చితె
యింటికొక్కకల్లుముంత యెగురుచుండెనె క॥
యీనెవ్వరోవచ్చి యిపుడువద్దననే నిన్ను
మానియెటుల బ్రతికియుందునె॥ క॥

వ అయ్యా! ఈకల్లుని మేము విడువలేము.

భక్తవిఠో—అయ్యలారా! మీరిట్లు చెప్పతగునా?

రా—నాదనామక్రియ. తా—ఆది.

ప॥ ఆంధ్రదేశులారా మనమందరమునుగూడి
అ॥ పాండురంగని భక్తితో మనము ప్రార్థనచేయవలెా
చ॥ కల్లుత్రాగరాదు మీరిట్లు కైపుబట్టరాదు
యిల్లువాకిళ్లు విక్రయించుకొని యిడుములు పడరాదు

త్రాగవలదుకల్లు నామాటను వినరయ్యా
దాటిగాను మీ కాళ్లకు నేను దండము బెట్టెదను
(అని కాళ్లకు మ్రొక్కును.)

అందరు—అయ్యా! లెండు. మేముత్రాగము.

గోవిందుఁడు—స్వామీ! మీ రెవరు? మీ రేల యిట్లువచ్చి మాకు బుద్ధి గరపుచున్నారు?

భక్తవిఠో—అయ్యా! నేనొక రాజును. యీ యరణ్యంబునకు వచ్చి హరినిగూర్చి తపస్సుగావించి యిటు వచ్చుచున్నాను. మీ వూ రెయ్యది? మీ పే రెయ్యది? మీరు కల్లుత్రాగవచ్చునా?

గోవిందుఁడు—స్వామీ! మావూరు అదో అవడమఁపురము. నా పేరు గోవిందుఁడు. వీనిపేరు కొండఁడు వీనిపేరు శేషఁడు. వీఁడు గంగడు. వీడు చెంగడు. వీడు రంగడు. మేము కష్టపడి యీకల్లుత్రాగితే బాగావుంటుందని యిక్కడికొచ్చాము.

భక్తవిఠో.—మిత్రులారా! యీకల్లు యింకత్రాగబోకుఁడు నేనొక కోర్కె తెల్పెదను అలాగుచేసెదరా?

గోవిందుఁడు.—స్వామీ! చెప్పుము. అట్లే చేసెదము

భక్తవిఠో—అయ్యా! యేమియూ కాదు. భగవంతుని సేవించుటకై పోవలెను.

గోవిందుఁడు.—అది యెక్కడికి పోవలెను?

భక్తవిఠో—మీరందరు నావెంబడి వచ్చెదరా?

గోవిందుఁడు—అట్లే వచ్చెదము. చెప్పుము.

భక్తవిఠో.—అయ్యా! ఈ కలియుగంబున యిచ్చటికి కొలది దూరంబున వెలయుచున్న శ్రీ పండరీపురం బను దివ్యక్షేత్రం బున్నది. అది మీకును తెలిసేవుండవచ్చును.

కొండఁడు.—అవును స్వామీ! మీబోటి పెద్దవారు చెప్పుచుండగ నేను వినియున్నాను. ఆగుడిలో యెవరున్నారు?

భక్తవిఠో—మిత్రులారా! ఆక్షేత్రంబున భక్తుండగు పుండరీకుని కొరకు భగవంతుఁడు "విఠ్ఠల్" అను నామంబుతో నడుమున కరంబులిడుకొని భక్తులను రక్షించుచున్నాఁడు మన మందరము గుమి

గూడి యచ్చటికిఁబోయి వారిని సేవించి రావలయు నని మిమ్ముల పిలిచెదను మీరు వచ్చెదరా?

గోవిందుఁడు.—అయ్యో స్వామి! మమ్ముల మీవెంట రమ్మనెదరా? యేమి నాకు తలిదండ్రులున్నారె! వారి నెట్లు విడిచిరాగలను వారిని కాపాడువా రెవరు?

భక్తవిఠో.—ఓరీ వెఱ్ఱివాఁడా! వారిని నీవే కాపాడుచున్నావా వారికి దిక్కు లేదా?

గోవిందుఁడు.—అయ్యా! వారికెవరుదిక్కు? నేనేగదా.

భక్తవిఠో.—అయ్యా! నీవు పుట్టనియెడల వారిని పోషించువా రెవరు?

గోవిందుఁడు.—అప్పుడు వారి తలవ్రాత రీతిని జరుగును.

భక్తవిఠో.—అది యెట్లుగలుగును?

గోవిందుఁడు.—వారిప్రక్క యా భగవంతుఁడే వున్నాఁడు.

భక్తవిఠో.—అందరికి యాభగవంతుఁడుండ నీవు యేల యిట్టి పిచ్చిమాటల నుడివెదవు. నీకు తల్లి యెవరు? తండ్రి యెవరు?

రా—యెదుకులకాంభోజి. తా—అట.

ఎందఱు తండ్రులో యెందఱు తనయులో
ఎందఱు అన్నలో యెందఱు మిత్రులో
ఎందఱు తల్లులో యెందఱు తమ్ములో
ఎందఱు చెల్లెలో యెందఱు బంధులో
ముందు యెన్నెన్ని జన్మము లెత్తిరో
తెలియ దాయెగ యీజన్మ మందున
మరల పుట్టెని గిట్టెని జన్మము
మానులార యీచింత విడువరే.

అటులుండ సమస్తచరాచరంబుల కాధారభూతుఁడై వెలయుచుండు శ్రీమన్నారాయణమూర్తియే మీకును నాకును నాతండ్రికిని తండ్రి. ఆదేవుని వక్షస్థలమున వెలయుచున్న శ్రీలక్ష్మీదేవియే మీకును, నాకును, నాతండ్రికిని తల్లి. వారిని దలచు వాఁడే భక్తుఁడు అటులుండ

నీవెన్ని జన్మముల నెత్తి యీ జన్మమునకు వచ్చితివి ? నీకు తల్లియెవరు ? తండ్రి యెవరు ? నిన్ను పోషించు వారినిం బొగడక యెవ్వరిని బొగడెదవు?

గోవిందుఁడు.—స్వామీ ! నాకు బుద్ధివచ్చినది. నేను వచ్చెదను.

భక్తవిఠో.—(కొండన్నిఁజూచి) అయ్యా నీవును వచ్చెదవా ?

కొండఁడు—అయ్యా నాకు బిడ్డలు సంసారమున్నదే వారిని విడిచి యెట్లువత్తును.

భక్తవిఠో.—ఓరయ్యా, సంసారమును విడిచి రాలేక యీడులాడుచున్నావా! అయ్యా సంసారమనగా సాగరము వంటిది. దాని నీదుట బహుదుస్తరము కావున నాముందు నిట్టి మాటలు వచింపకుము. నీకిష్ట మున్నచో రమ్ము. లేకున్న పొమ్ము.

కొండఁడు—స్వామీ ! కోపము చేయకుడు నేనువచ్చెదను.

భక్తవిఠో.—ఓరీ శేషా! నీవేమనెదవు?

శేషఁడు—స్వామీ, నాకు చాలాభూములున్నవి వాటినివిడిచి నేనెట్లువత్తును?

భక్తవిఠో.—ఓరీ, నీభూము లెక్కువాయెనా ? ఆ భగవంతుని స్మరణ తక్కువాయెనా? ఓరీ మూఢా! నీయాశ విడచిరాలేక యల్లాడుచున్నావా చెప్పెద నాలకించుము.

సీ. ఆత్మవెళ్లిన దేహ మగ్నిహోత్రుని పాలు
కఠినశల్యంబులు గంగపాలు
మీఁద గప్పినబట్ట మేటిచాకలిపాలు
అల్లజీవుఁడు కాలయమునిపాలు
యిల్లుమంచముసొమ్ము యితరలోకులపాలు
భ్రష్టపెండ్లామైన పరులపాలు
కొడుకుఁ బెట్టిన యట్టి కూడు కాకులపాలు
దాఁచిబెట్టినసొమ్ము ధరణిపాలు
గీ. యేది తనవెంట రాబోదు యెవరికైన
హరిని గొల్చిన వారికే నిత్యసుఖము

## ద్వితీయాంకము.

శంఖచక్ర గదాహస్త సార్వభౌమ
అఖిల లోకాభి రామ పట్టాభిరామ.

ఓరీ మూఢాత్మా! ధనధాన్యములను నమ్మి భగవంతునిస్మరింపని వారికి నరకప్రాప్తిగలుగును. యిట్టిమాటలు నాముందు నుడువకుము.

శేషుడు—స్వామీ, యింక నేనేమిజెప్పను మీతోగవచ్చెదను.

చెంగయ్య—(అంగడినుండి లేచివచ్చి) స్వామీ, వీరికి మీరు చెప్పునది విని నాకును మీతోడ రావలెనని బుద్ధిపొడమినది గాని నేను వేళకు భుజించి అంగటియందు కూర్చొని వుండే యలవాటు గల్గినవాడను. మీతోడవచ్చినయెడల ఆ యడవిలో అన్నంలేక యెక్కడనైనా ప్రాణం పోవునేమో యని భయపడుచున్నాను

భక్తవిటో.—అయ్యా, నీవు యీశరీరం విడువలేక భయపడుచున్నావా? యిది నీకు శాశ్వతమనుకొంటివా? తెల్పెద వినుము.

సీ పాంచ భౌతికము దుర్భలమైన దేహంబు
యెప్పుడో విడిచేది యేక్షణంబో
శత వత్సరముల దాక మితము జెప్పిరిగాని
నమ్మరాదామాట నెమ్మనమున
బాల్య మందో మంచిప్రాయమందో లేక
యౌవ్వన మందో లేక ముదిమియందో
యూరనో యడవినో యుదక మధ్యంబునో
యెచ్చోట విడిచేది యెరుక లేదు
గీ మరణమే నిశ్చయము బుద్ధి మంతుడైన
తనువు యున్నంతలో హరిని దలపవలెను
యిట్టి బుద్ధులనెల్లను విడిచి నీవు
హరినిధ్యానింపు మెప్పుడు అవనిలోన.

అని పెద్దలు పూర్వము తెలిపియుండిరిగదా. కావున యీశరీరము నిశ్చయముకాదు దేహమున్నంతలో శ్రీహరిని దలచువారికే మోక్షము గలుగును

చెంగయ్య.—అయ్యా, యిది నిజమేనా ! యెప్పుడైనను చావు సిద్ధమేనా? అటులైన నేనున్ను మీతోడ వచ్చెదను.

శ్రీ భక్తవిఠోబా.

గంగఁడు.—స్వామీ, నేనును మీతోడ రావలెనని యున్నాను. యింటికిపోయి తెల్పి వచ్చెదను.

భక్తవిఠో—అయ్యా యిటురమ్ము యిందుకు పెద్దవారివద్ద చెప్పిరావలెనా? అయిన తెల్పెద వినుము.

సీ. శ్రీపాండురంగని సేవింప జనుచుండ
చిత్తంబునను నీకు చింతయేల
తనదుప్రాణంబులు తరలి పోవుచునుండ
తల్లిదండ్రులయాజ్ఞ తలపనేల
జీవుల పోషింప శ్రీచక్రధరుడుండ
ఆకలిచేత నీ వడయనేల
తనవారలని నమ్మి తాపంబునొందెదు
తనువుపై నీకింత తమకమేల
గీ. మట్టిపాలగునట్టి యీ మమత విడచి
హరిని ధ్యానించు చుండుడీ యాత్మలోన
వేరుతలపంగ నేటికి వెఱ్ఱులార
నిజము చెప్పితి మీతోడ నేడు నేను.

అయ్యా నీవు భగవంతుని జూడ బోవుటకై నీతల్లిదండ్రులతో జెప్పవలయునా? యెంత పిచ్చిమాటలాడెదవు?

గంగఁడు.—అయ్యా చెప్పవలదా, సరేకానిండు వచ్చెదను.

భక్తవిఠో.—అప్పా నీవున్ను వచ్చెదవా?

రంగఁడు—స్వామీ భార్యాపుత్రులను విడిచివచ్చేవారుండ నేనేలరాకూడదు. నేనున్ను వచ్చెదను. నాకెవ్వరును లేరు మీరే నాకుదిక్కు.

భక్తవిఠో—అబ్బాయి! నీకెవ్వరును లేరా?

రంగఁడు—స్వామీ! నాకెవ్వరును లేరు. నేనొక్కడనే.

భక్తవిఠో—అయ్యా! నిన్ను భగవంతుఁడు రక్షింప గలఁడు. నీకేకష్టములు గలుగవు రమ్ము. (అందరిని జూచి) మిత్రులారా అందరికి సమ్మతమైనదా?

గోవిందుఁడు—స్వామీ! అందరకు సమ్మతమే.

భక్తవిఠో.—అయితే నేను చెప్పినట్లు మీరు చెప్పుడు. మనము పోవునపుడు దేనియందు బుద్ధి నిలపక భగవంతుని నమ్మి.

రా—ఇక్ కాపి తా—చాపు.

ఆత్మవిఠేల పరమాత్మవిఠేల జీవాత్మవిఠేల విఠేలా
మాతావిఠేల పితావిఠేల సోదరవిఠేల విఠేలా
బంధువిఠేల దీనబంధువిఠేల స్నేహవిఠేల విఠేలా
మాత్రాతవిఠేల మద్భాశ్రితవిఠేల పాండురంగవిఠేల విఠేలా
వ. అనునట్లు సర్వము భగవంతుడే యని పోవలెను రండు.

(నిష్క్రమింతురు)

తెర వాలును.

(రంగము 2) పప్పుశెట్టి గృహము)

(కమలప్రవేశము)

కమల— రా—యమన్ కల్యాణి తా—ఏకం.

ప॥ స్వద్దేచ మాతనీ పదారవిందముల్
అ॥ సదా మనిన్ భజించెదన్ ముదంబు మీరగ
చ॥ వరాలతల్లినా మొరాలకించవే బిరాన
కనికరంబునుంచి వరాలొసంగుమా.

యింతవరకు పెత్తనములైనవి. అంగడికిపోయినశెట్టి వచ్చువేళా యెను. యిం కా యింటియందేపనియును కాలేదు. ఒక పనికత్తెను పెట్టుమంటే పెట్టనంటాడు వీనివద్దపడేదానికంటే యెచ్చటనైనా పోయిబ్రతుకవచ్చును. ఉం! సరే యిప్పుడయ్యేపనులుజూచి వెనుక యోచించెదను.

(అని గృహములోనికి ప్రవేశించును)

పప్పుశెట్టి—(ప్రవేశము.)

రా—అసావేరి. తా—ఏకం.

ప॥ ప్రజలందరు ఖద్దరు నెప్పుడు కట్టవలయును
అ॥ కట్టవలయును ఖద్దరు కట్టవలయును॥ ప్ర॥

చ॥ ఇండియా రాజ్యములో నింపైన బీదలకు
స్వదేశి బట్టలను సరగ మీరగ
సరగ మీరగ ముచ్చటలు దీరగా॥ ప్ర॥

(తనలో) ఏమిటో వ్యాపారం చూ_స్తే తెల్లవారిలేచి ఒకకాసు బోణీకాలేదు. ఆయవస్థ యటులుండ నాకొక జంటిల్‌మేన్ భార్యను తెచ్చి కట్టినారు. అది వేళకు భోజనానికివ_స్తే నేనెంత మంచిగా మాట్లాడినా నాయందు కొంచెమైనను మతింపులేకయే మాట్లాడుతుంది. దీని వ్యాపారముచూ_స్తే యిట్లా వున్నది. (అసి గడపవద్దకు వెళ్లి ప్రకాశముగా) ఏమే వేంచేస్తున్నా?

కమల.—యేమి. వచ్చేటప్పుడే యేమే అంటూరావలనా? కమలా యిటురమ్ము అని పిలువరాదా? నీతో యేగేది నాకు పెద్ద శనిగాయున్నది. నేను చచ్చినా బాగుంటును.

పప్పుసెట్టి.—నీవు చ_స్తివేని నేను సుఖపడెదను.

కమల.—నేనెందులకు చావవలెను? నాకు మాయమ్మగారున్నారు. లేక యింకా యెక్కడికి పోయినా నాకు భోజనము దొరకదను కొంటిరా యేమి? నన్ను చూచినమాత్రమున నా యందానికి మెచ్చి యెందరో నాకన్నము పెట్ట గలరు. నీముఖానికి అన్నము దొరక దనుకో.

పప్పుశెట్టి.—అది నిజమే. నిన్ను కట్టుకొన్నది మొదలు నాకన్ని కష్టములే. యిప్పటికే భోజనానికి జరిగేదిగూడ కష్టముగాయున్నది. నీవు నాదగ్గర కష్టపడ జాలవుగాని నీయమ్మగారింటికే పోయి బ్రతుకుము.

కమల.—అంతకు ముందు నీవద్ద నుంటా ననుకొంటివా యేమి? నాకేమి గ్రహచారము పట్టలేదు. నీవద్ద యీపోరు పడుటకన్న అట్లుపోయ్యేది మేలు

పప్పుశెట్టి.—అవును. యిటువంటిదానవు యీకలియుగమున నుండబట్టియే యిట్టి కరువు లన్నియు వచ్చుచున్నది. అందరు నీలాగు పతివ్రతలుగానుంటే ఆపుణ్యానికి భరింపలేరు.

కమల.—ఏమి నేను పతివ్రతను గానా?

పప్పుశెట్టి.—సరే. నీవు చాలా పతివ్రతవేగాని నీవద్దమాటలు చేత ప్రొద్దగుచున్నది. నాకన్నము పెట్టుము. నేను పోవలెను.




కమల కప్పుసెట్టిని దుర్భాష లాడుట.

కమల — నీపిండము తినిపొమ్ము నిన్నెవరు పట్టుకొన్నారు!

పప్పుశెట్టి.— వేయుము. (అని గృహములోకి వెళ్లును.)

కమల.—(స్వగతము) యిట్టి మట్టుమర్యాదలేని భర్తలవద్ద యీ పోరు యెవరు పడగలరు. నేటితో నాకుపట్టినశని వదలుచున్నది. నేను యింక సుఖ మనుభవించగలను.

(అని గృహములోకి వెళ్లును)

నరసింహులు—పరుగునవచ్చి (స్వగతము) యీశెట్టిగారు అప్పు యిచ్చిన కల్లుఅంగడి చెంగయ్యనాయుడు అంగడి విడిచి యెవరివెంటనో వెళ్లినాడంట యీసంగతి శెట్టికిచెప్పినట్లయితే వారిప్రాణములె పోవును. చెప్పి తీరవలెను. (అని యింటి ద్వారం దగ్గరకువెళ్లి)

ఓ శెట్టిగారూ!

పప్పుశెట్టి—(లోపలి నుంచి) యెవర్రా వాడు అరిచేది!

నరసింహులు.—శెట్టిగారు· బయట రావయ్య చెప్తాను.

పప్పుశెట్టి.—ఒరే చెప్పర, నేను స్నానంచేస్తున్నాను.

నరసింహులు —నీస్నానం కూలిపోను. అవతల చేస్తు రావయ్య. నీకొంప మునిగింది.

పప్పుశెట్టి:—(స్నానం తడిగుడ్డతో పరుగున బయటికివచ్చి) ఒరె యేమిరా నాకొంప మునిగిందంటావు

నరసింహులు —అయ్యా ! నీవు రెండువేలు రూపాయిలు అప్పు యిచ్చివుండిన కల్లుఅంగడి చెంగయ్యనాయుడు అంగడి విడిచిపెట్టి యెవరో సన్యాసులువస్తే వారివెంట యాత్ర వెళ్లినాడట.

పప్పుశెట్టి —(గడగడ వణకుచు) ఒరే, ఒరే, పోయెనే, అయ్యో పోయెనే.

(అని క్రిందపడును. నరసింహులు లేపి కూర్చుండ బెట్టె)

(లేచి)— రా—హిందుస్తాని కాపి. తా—అట.

ప॥ అయ్యో పోయెనె డబ్బు పోయెనే

అ॥ నేనేమిచేతు యింకెట్లు యుండు పో॥

చ॥ కష్టపడి సంపాదించి కడుపార తినలేక

యిట్టి వారికిల్లయిచ్చి యిడుమలు
పడవలసి వచ్చె అయ్యో. పో॥

(అని యేడ్చుచుండ.)

కమల.— (బయటికి వచ్చి)

అయ్యో, యేమి యింటిముందర చేరి సోంబేరిలాగరుస్తున్నావే. నామానం పోవుచున్నదే.

పప్పుశెట్టి.—(లేచి)

యేమే, నాడబ్బుపోయి నేను అల్లాడుతువుంటే నీమానంపోవున దేముంది.

కమల.—నీమాటలచేత అందరు నవ్వుచున్నారుగాని, నామాన మేమియు పోలేదు. నీపిండము తిని పొమ్ము.

పప్పుశెట్టి.—అయ్యో, చాలు నీపోరు. (అని లోపలికి వెళ్లును)

కమల.—(స్వగతము) యిట్టి మూఢబుద్ధి గలిగిన వానికి నాతలి దండ్రులు తెలియక నన్నిచ్చినారు. యీనకు యన్నముపెట్టి అంగటికి పంపి నాతల్లిగారింటికివెల్లి నాకష్టసుఖములను జెప్పుకొనెదను.

(అని గృహములో ప్రవేశించును.)

నరసింహులు.— (స్వగతము) ఆహా! శెట్టిగారికి బహుశ్రమగా యున్నది. వీరికి రెండు చెంపలు పెట్లు పడుచున్నది. గాన వారు చాలా కష్టపడుచున్నారు. యిట్టి దానిని నాకు వివాహము చేసియుండిరేని దానిని ఏమి చేయుదును తెలియునా. అంతపనిచేస్తును. ఉండని యింక యేదేని చెప్పెనేని నేనే తన్నెదను

పప్పుశెట్టి.—(బయటికివచ్చి) ఏమె! వక్కలాకులు యెత్తుకొనిరా.

కమల.—మీకు వక్కలాకు లొకటి కావలయునా? యిక్కడ యేమిలేదుపొమ్ము.

పప్పుశెట్టి.— ఏమే. నీదగ్గర యేగేది నాకు చాలా కష్టమై పోయినది.

కమల.—నాముందు "యేమే, గీమే" అనకుము. మర్యాద చెడి పోవును. వూరక పొమ్ము.

పప్పుశెట్టి — అయ్యో, యింక మాట్లాడితే కొట్టెదవాయేమి. ఈకలియుగమున మగవాళ్లు స్త్రీలకు భయపడెదరే. అట్లు నేను భయ పడుదు నను కొంటివా? జాగ్రత్త. నేనట్లు భయపడువాడను గాను. అయితే యిప్పుడు నీమదమణఁచుదునుగాని, నాకు వేళైనది. నీవింటి యందు జాగ్రతగా నుండుము నీపని రాత్రికి జెప్పెదను.

(అని నిష్క్రమించును)

కమల. — (స్వగతము) అయ్యో ఈపాపిదగ్గరపడేని నాకు చాలా శ్రమగాయున్నది. ఇంక రాత్రికివస్తే కొట్టకమానడు వీనిదగ్గర దెబ్బలు తినుటకన్న తల్లిగారింటికి పోవుటయే మేలు యిఁక నిందుండఁగూడదు.

(అని నిష్క్రమించును)

తెరవాలును.

(రంగము 3) అరణ్యము.

(భక్తవిఠోబా, భక్తులు ప్రవేశము.)

భక్తవిఠో. — రా — బ్యాగు. తా — ఆది.

ప॥ నీరజాక్ష నేరమేరా నిన్ను నేర నమ్మినార

అ॥ సారసాక్ష మమ్ము వేగ సన్నుతాంగ కావవేరా॥ నీ॥

చ॥ నిన్ను నెరనమ్మినార నన్ను బ్రోవ నేరమేరా
పాండురంగ పద్మనాభ పాలనైతి బ్రోవుమయ్య॥ నీ॥

అయ్యా, వింటిరే. మనము అన్నియు మరచి ఆ పాండురంగని సర్వము నీవే యని నమ్మి పోవుచుందుమేని మన కేకష్టములు కలుగ నీయక కాపాడుచుండును.

గోవిందుఁడు — ఇప్పటి కన్నియు దెలిసినది. రండు పోవుదము.

భక్తవిఠో. — (ఆలకించి) అయ్యా, అదో వింటిరే? ఈ యడవిలో నెవరో దుఃఖించుచు వచ్చుచున్నారు. ఇటు నిలువుఁడు చూచెదము.

(అని అందరు ఒకవైపున నిలిచెదరు)

పప్పుశెట్టి. — (ప్రవేశము.)

రా—ముఖారి. తా—చాపు.

ప॥ అయ్యో నే నేమి సేతు నగచాట్లు బ్రతుకాయె రామా
అ॥ ఈ యన్యాయ వనితకై అడవి తిరుగవలసె
చ॥ ఎందెందు వెదకిన నింతి కానదయ్యె రామా ఈ
యంధకారమైన యడవి నెవ్వరు లేరే రామా.

(అటునిటు జూచి) అయ్యా, మీ రెవరు? ఈ దారి నొక స్త్రీని జూచితిరా?

భక్తవినో—అయ్యా, మీ రెందుండు వారు? ఆస్త్రీ యెవరు? ఏల యీ యరణ్యంబున వెదకుచున్నారు?

పప్పుశెట్టి—అయ్యా, ఆస్త్రీ నాభార్య. అది నిరతము నేను పని మీదబోయి వచ్చునంతలో యింటియందు పనులుచూడక నాతో విరోధముగా మాట్లాడుచుండును. కొంచెమైనను నాయందు విశ్వాసములేక నటించును. అందులకు నే నేదేనియు నంటినేని నన్ను దూషించుచుండును. ఇట్లుండ నది నేడు నాతో జగడమాడి నేను బజారుకుపోయి వచ్చునంతలో యింటియందు లేదాయెను. అందుకై నేనీదారిన అది దాని తల్లిగారింటికి వెళ్లినదేమో యని వెదకుచు వచ్చుచున్నాడను.

భక్తవినో.—అయ్యా, మీరు చేయు వ్యాపారమునకన్న మీ భార్యవ్యాపారమే మీకు పెద్దదిగా యున్నదా? తెల్పెద వినుడు.

సీ॥ జగతిలో మానవ జన్మంబు దొరకదు
దొరకినఁ బురుషుఁడై పుట్టుటరుదు
పురుషుఁడై పుట్టిన పొంతి మంచిసెరాదు
వచ్చినా భాగ్యంబు హెచ్చుటరుదు
భాగ్యశాలికి పుత్ర ఫలము చేకూరదు
కూడిన వితరణ జాడలరుదు
వితరణ గల్గిన విహిత శాంతము సున్న
శాంతంబు గల్గిన సత్యమరుదు
గీ॥ సత్య వతునకు శ్రీహరిస్మరణ లరుదు
స్మరణ గల్గిన వాడెపో ధరను యోగి




శ్రీపండరినాథుడు భక్తవిఠోబాకు వరం బొసంగుట.

యిట్టి చింతల నెల్లను విడిచినీవు
హరిని ధ్యానింపు మిప్పుడు అవనిలోన.

అన్నట్లు యీలోకములో పతికి దగిన సతి దొరకదు. సతికిం దగిన పతి దొరకడు. నీవేల యిట్టిచింతలం బడెదవు ?

(అని కొంతతడవు యోచించి)

అయ్యా, నీవు మరుగున నుండుము అదో యేదో స్త్రీకంఠము వినవచ్చుచున్నది. వినుము. (అని యందరు విందురు)

కమల.—(ప్రవేశించి)

రా—ఎదుకులకాంభోజి. తా—చాపు.

ప॥ అయ్యో ఇదేటి గతి అయ్యో
అ॥ అన్యాయమై పోతినే అడవియందు
దారి తెలియక నేనీ దారిని వచ్చితినె॥ అయ్యో
చ॥ నాధునీ విడనాడి నందు కీగతియాయె॥ అయ్యో
అన్యాయబ్రతుకాయె నయ్యో నేనేమిసేతు॥ అయ్యో
అమ్మాగారింటికేగి అడవిపాలైతినే
యేదారిం బోదు నింక యెవరుబోధించెడివారు॥ అయ్యో.

అయ్యో నాగర్వము నన్నడంచినది. (అటు నిటు జూచి)

అయ్యా మీరెవరు? ఈ యరణ్యంబున నెచటికిం బోవుచున్నారు?

భక్తవిఠో.—అమ్మా నీవెవ్వరవు ? నీవీయరణ్యంబున నొంటరిగా నెచ్చటికిం బోవుచున్నావు? నీయూరెయ్యది?

కమల—అయ్యా నాయూ రిచటికి కొలందిదూరంబున నున్నది. నాపతి యొనర్చెడి బాధల నోర్వలేక నాతల్లిగారింటికిం బోవుచు దారి తప్పి యిట్లు వచ్చితిని.

భక్తవిఠో—అమ్మా నీవు నుడివిన మాటలంజూడ నీవు మహా పతివ్రతగా నున్నావు. అందువలననే యిట్టి కష్టంబులం బడుచున్నావు.

కమల—అయ్యా ఏమంటిరి? నేను పతివ్రతను గానా?

భక్తవిఠో.—అమ్మా నీవు పతిబెట్టు హింసల నోర్వలేక పతినివిడచి వచ్చినమాత్రమున నీవు మహాపతివ్రతవేగదా.

కమల.—పతి యెట్టికష్టములు బెట్టినను నోర్చియుండవలెనా ?

భక్తవిఠో.—అది నీకు తెలియదా ?
కమల.—ఇంకెట్లు లుండవలయును ?
భక్తవిఠో — తెల్పెద వినుము.

శ్లో. కార్యేషుదాసి కరణేషుమంత్రి
రూపేచ లక్ష్మి క్షమయాధరిత్రి
భోజ్యేషుమాతా శయనేతువేశ్యా
షట్కర్మనారి కులధర్మపత్ని.

అమ్మా పతియొక్క పనులు జేయుటయందు పనికత్తెవలెను, సమయోచిత బుద్ధి చెప్పుటయందు మంత్రివలెను, రూపమునందు లక్ష్మివలెను, శాంతమునందు భూదేవివలెను, ఆకలిదెలసి ఉపచరించుటయందు తల్లివలెను, పడకయందు వేశ్యవలెను, యిట్టి గుణములు గల్గి సంసారమున పతి యెట్టికష్టములు బెట్టినను, శిరస్సు ఖండించినను వోర్చి పతికేకష్టముగలుగక కాపాడునట్టిస్త్రీయే పతివ్రతయగును. నీయట్టివారేలాగు పతివ్రత లగుదురు.

కమల — అయ్యా, నాకు తెలియదు. అదియెట్లు లుండవలెను?

భక్తవిఠో.—అమ్మా, నీవు ఉషయంబున లేచి స్నానంబు జేసి ముఖంబున కుంకుమ నిడి, పతి నిద్రమేలుకొనువరకు పాదములకడ కాచియుండి నిద్రలేచినవెంటనే వారిపాదంబుల జలంబులచే శుభ్రపరచి పుష్పములచే బూజించి, కర్పూరహారతినిచ్చి, ప్రదక్షిణం బొనర్చి, వారికేకష్టంబులుం గలుగకుండవలయునని భగవంతుని ప్రార్థించుచుండు వేని నీపతిభక్తికి భగవంతుండు మెచ్చి సతీపతులకు మోక్షంబివ్వగలడు ఇట్లు చేయువారలే పతివ్రత లనబడుదురు.

కమల.—అయ్యా, ఇంక నాకుబుద్ధివచ్చినది. మీయాజ్ఞచొప్పున నడచుకొనెదను. నన్ను మన్నింపుడు.

భక్తవిఠో—(పప్పుశెట్టినిజూచి) అయ్యా యిటురమ్ము.
(కమలనుజూచి) అమ్మా, పీరెవరు?
కమల.—హా! నాథా! నాతప్పులను క్షమింపుడు.
(అని కాళ్ళపైబడును.)
పప్పుశెట్టి —కమలా లెమ్మ. క్షమించితిని.

భక్తవిఠో—అయ్యా, ఇంక మీపురంబునకుంబోయి సుఖంబుగా నుండుము.

పప్పుశెట్టి—అలాగే పోయెదము. యీకల్లుఅంగటి చెంగయ్య నాయుడు నాకు రెండువేలురూప్యము బాకియివ్వకనే మావెంబడ వచ్చినారు

భక్తవిఠో.—(చెంగయ్యనుచూచి) అయ్యా వీరికి మీరు రూపాయలు యివ్వవలయునా?

చెంగయ్య—అవును స్వామీ! నాకు చాలానష్టముగలిగి యివ్వలేక మీవెంబడివస్తిని.

భక్తవిఠో—(శెట్టినిచూచి) అయ్యా, వారు యివ్వవలసినడబ్బు నేను వచ్చునపుడు మీకు యిచ్చెదను మీరు వెళ్లుడు.

పప్పుశెట్టి—దేవా, మీరు మాగృహంబునకు రావలెను.

భక్తవిఠో.—అలాగేవచ్చెదను పొండు.

పప్పుశెట్టి, కమల—దేవా! మేముబోయివచ్చెదము. నమస్కారము.

భక్తవిఠో—సుఖంబుగా వర్ధిల్లుడు. (నిష్క్రమింతురు.)

(భక్తులంజూచి) అయ్యలారా, మనకు ప్రొద్దగుచున్నది. పోవుదము రండు.

భక్తులందరు—అలాగేపోవుదము.

భక్తవిఠో.— రా—హిందుస్థాని భైరవి. తా—రూపకం.

ప॥ పాండురంగ పాహిమాం పాండురంగ పాహిమాం॥

అ॥ పాండురంగపాహిమాం రంగ పాహిమా॥

చ॥ సాకేతనాథ సాధురక్షణా లోకత్రయవినుత ఓలోకలోచనా॥

(నిష్క్రమింతురు)

తెర వాలును.

# చతుర్థాంకము.

(రంగము 1) పండరీక్షేత్ర దేవాలయము.

(భక్తవిఠో, భక్తులు ప్రవేశము)

అందరు.— రా—హమీర్‌కల్యాణి. తా—రూపకం.

ప॥ నమోనారాయణ నాథపరంధామ

అ॥ నాదుపాండురంగా నన్నుబ్రోవుమయ్య, ఓం

చ॥ ఆదిమూలజనిత ఆనందకల్యాణ

సాధురక్షణా సంసారసగుణ మృదుచరణ

లోకత్రయవినుత ఓ లోకసుందరాకార॥ నమో॥

భక్తవిఠో—మిత్రులారా! ఇదిగో చూచితిరా, పాండురంగు డెంతరమ్యముగా వెలయుచున్నాడో, వారిని సేవించినమాత్రమున మన పాపములు సూర్యునిగాంచిన చీకటివలె పటాపంచలైనవి ఇక వారిని మనము ఆలింగనము చేసికొని కర్పూరహారతినిచ్చి ప్రార్థించెదము రండు.

కొండడు—ఆలాగే సేవింతము.

(ఇచ్చట అందరు ఆలింగనాదులొనర్చి పూలతో నర్చించి హారతులిచ్చి భక్తులున్ను, రాజున్ను కూర్చొని ప్రార్థింతురు.)

అందరు— రా—శంకరాభరణం. తా—రూపక.

ప॥ హేదయానిధే హేకృపానిధే

అ॥ హేదయానిధే మమ్ము వేగబ్రోవుమా

చ॥ దాసులంచునీ దరినిజేరితిమీ

దాసులకునీ దర్శనమిమ్ము

దర్శనమిచ్చి యీదాసులకును

మోక్షమొసఁగుమీ మోహనరంగా॥

భక్తవిఠో.—ఓ దేవా, నీదాసుడను నమస్కరించెదను. నాకు ప్రత్యక్షమై వేగిరము నన్ను రక్షింపుము.

(పాండురంగడు ప్రత్యక్షము)

(ఇచ్చట భక్తులుమాత్రము క్రిందపడి నమస్కరించవలెను)

పాండురంగఁడు —

తోహర. మెచ్చితిరాజా నీకిచ్చెద వేడ్కగోనుము యింపుతో వరముల్
సచ్చరితుడవై నీవిల సత్యముతో రాజ్యమేలి సరసముతోడన్
వచ్చెదవు నీవు నావల వానరగవై కుంఠపదవి నీవు బడసెదురాజా.

ఓభక్తాగ్రణీ! నీభక్తికి మెచ్చితిని. నీవు రాజ్యంబునంగల జనులకు భక్తి నుపదేశింపుము. వలయు వరంబులంగోరు మిచ్చెదను.

భక్తవిఠో.— దేవా, ఈ పాపాత్ము డింకను ఈలోకమందుండ వలెనా ?

పాండురంగఁడు.—రాజా ! భక్తిమార్గము నీరాజ్యంబునంగల దుష్టులకుపదేశించి వారిని భక్తులం జేయుట కొరకు నీవింక కొంతకాల మిచ్చటనుండ వలయును.

భక్తవిఠో —దేవా ! వీరిగతి యెట్లు ?

పాండురంగఁడు —వారు మోక్షమును బొందగలరు .

భక్తవిఠో.—అటులైన నేను మీ సన్నిధిం జేరువరకు మీభక్తి మరుపకుండు నటుల వరంబొసఁగుఁడు.

పాండురంగఁడు.—భక్తశిఖామణీ ! ఆలాగే యిచ్చితిని.

భక్తవిఠో —దేవా, దాసుడను నమస్కరించెదను.

పాండురంగడు —శుభముగా వర్ధిల్లుము

భక్తవిఠో — రా—హిందుస్తానిబ్యాగు తా—ఆది

ప॥ భక్తవత్సలా భవ్యచరిత్రా
అ॥ భక్తప్రియా ఓపాండురంగా
చ॥ నిరతము నీపద నీరజములనే నెరనమ్మినన్ వేగబ్రోవుమా॥

(భక్తవిఠో నిష్క్రమించును.)

(రాజువెళ్లినదే టర్నింగ్ సీను వేసి భక్తులెల్ల గోపికలుగా మారుదురు. భక్తులు వారివారి దేహములును జూచుకొని,)

గోవిందుఁడు:—హా! ఇదేమి వింతగా నున్నది! మన మువారిపాదములకు మ్రొక్కి లేచినంతమాత్రమున స్త్రీలై యున్నాము.

కొండఁడు — మనమేల యిట్లయితిమి?

శేషఁడు. — అది యెవరు చెప్పగలరు?

గంగఁడు — స్వాముల వారిం నడిగిన చెప్పుదురు.

చెంగయ్య. — వారిని ప్రార్థించి యడిగెదము. కూర్చుందుడు.

(అందరు కూర్చొని ప్రార్థన)

అందరు — రా — శంకరాభరణము. తా — రూపకం

ప॥ హేదయానిధే. హేకృపానిధే

అ॥ ఇదేటి వింతలు మాకు, వేగదెల్పుమా

చ॥ మీదుసేవకై మేమిందు రాగా మమ్ము
యీవిధిజేయ యిదేటి చోద్యమో
వేగదెల్పుమా ఓవేదవందితా
దాసులంచుమీ దరిజేర్చుమీ.

(పాండురంగఁడు ప్రత్యక్షము)

అందరు — దేవా! నమస్కారము.

పాండురంగఁడు — ఓ భక్తశిఖామణులారా! మీరు స్త్రీరూపమును దాల్చుట యేమనగా నేను తొల్లి త్రేతాయుగంబున రామావతారుండనై యుండుతరి మీరందరును వనచరులై యుంటిరి. అట్టి సమయంబున లంకాధిపతులగు రావణ కుంభకర్ణాదులం ద్రుంచి విభీషణునకు పట్టాభిషేకం బొనర్చి సీతాసమేతముగా నయోధ్యాపురికి వచ్చునపుడు మీరందరు నన్ను ఆలింగన మొనర్పం గోరితిరి. నేనా యుగంబున నేకపత్నీవ్రతుండనయి యుండుటచే మీ కొరకు ద్వాపరయుగంబున కృష్ణావతారుండనై వెలయుదును మీరు గోపికలుగా జన్మింతురేని ఆసమయంబున మీకు ఆలింగనాదులిచ్చి ఆదరించెదనని తెల్పియుంటిని. తన్నిమిత్తమున మీరు ఈ భక్త శిఖామణి వెంటవచ్చి నన్ను దర్శించినందుచే ఈ స్త్రీరూపంబులం బడసితిరి కావున యిచ్చటికి కొలదిదూరంబున యుండు గోకుల బృందావనమున కృష్ణుడనై వెలసియున్నాడను మీరందరు అచ్చటికివెళ్లి మీకోర్కెలం దీర్చికొనుడు. (అని యదృశ్యుండగును)

(ముందు తెరవాలును.)

గోవిందుఁడు — హా, చూచితిరా ఈ భ క్తశిఖామణి వెంట వచ్చి నందులకు దర్శనము కలిగినది ఇఁక నిందుండ నవసరము లేదు. మనమం దరము గోకులబృందావనమున కేగి కృష్ణమూర్తిని దర్శించెదము.

కొండఁడు — అన్నా! యిపుడు మన మేపేర్లతో పిలుచుకొందము.

గోవిందుఁడు — అవును. యిపుడు నేనుంచు పేర్లతో వారువారు పిలుచుకొనెదము.

(కొండన్ని చూచి) నీవు కోమలవల్లి
(శేషన్ని చూచి) నీవు శేషాంగన
(రంగన్ని చూచి) నీవు రంగనాయకి
(గంగన్ని చూచి) నీవు గంగభాయి
(చెంగయ్యనుచూచి) నీవు చంపకవల్లి
నా పేరు గోవిందమ్మ యని వాడుకొందము.

కోమలవల్లి — అవునమ్మ అశ్లోకానిమ్ము. యిక పోవుదము

గోవిందమ్మ — రా — శ్రీరాగం తా — ఆది.

రా రే గోకుల బృందావనమునకు
వేగమె పోవుదము. రా రే॥
వేగమెచని యా వేణుగోపాలుని
ఆశదీర యాలింగన మొనర్చను. రా రే॥

(అని నిష్క్రమింతురు.)

తె ర వా లు ను.

(రంగము 2) పప్పుసెట్టిగృహము.

(సెట్టి పరుపుపై నిద్రించుచుండును)

కమల — (ప్రవేశము) (తట్టలో పూలహారములు రెంటి నుంచు కొని, కర్పూరహారతి తీసికొని వచ్చి నాథుని జూచి) ప్రాణనాథుఁడు నిద్రించుచున్నారు. నిద్రలేపకయే పాదముల నొత్తుచుండెదను. (అని ప్రాణనాథునికిఁ ప్రదక్షిణముఁ జేసి పాదముల నొత్తుచు,)

సీ. లోకములోనున్న లోలాక్షులకు నెల్ల
ప్రాకట దైవంబు ప్రాణవిభుడు,
ఉదయంబునను లేచి యుదకంబు చేకొని
పాదముల్ బాగుగా శుభ్రపరచి
హారతిచేకొని యతిభక్తి నర్చించి
నీవె దైవంబని నేర్పుతోడ,
భక్తితో ముమ్మారు ప్రదక్షిణల్ గావించి
పాదపద్మముల్ కంట గదియ తాకి,

గీ. గొల్పుచుండెడి స్త్రీలకుఁ గొదవలేక
దైవ మిప్పించు నిష్టార్థ తతులు గాన
పతియె దైవం బటంచుతా మతిని దలచు
స్త్రీల కెన్నట్టి కైనను చింతలేదు

గాన నేను బుద్ధిలేనిదాన నగుటచే విషయములు తెలియక చాల కష్టపడితిని. ఆ మహనీయుని కృపవలన నాకిట్టిసుఖము చేకూరెను. గాన స్త్రీలెల్లరను పతియే దైవమని యెంచి వారిని పూజచేయుచుందురేని యెట్టి కష్టములును గలుగక సుఖముగా వర్ధిల్లెదరు.

పప్పుశెట్టి.—(నిద్రలేచి) కమలా ! తెల్లవారినదా ?

కమల.—నాథా ! తెల్లవారినది మీ పాదపూజకై వేచి యున్నాను.

పప్పుసెట్టి.—కమలా! నీపనులు దీర్చుకొని పొమ్ము. (అని కుర్చీపై కూర్చుండును)

కమల.—(పాదములను గడిగి గంధపుష్పాక్షతలచే పూజించి, మెడ యందు పూలహారమును వేసి కర్పూరహారతి నిచ్చి కూర్చుండి) ప్రార్థన.

రా—తోడి. తా—రూపకం.

ప॥ మీపదము లేగతి మీపదము లేగతి

అ॥ మీపాదములకు పూజజేసి ప్రమొక్కెదనిదో॥ మీ॥

చ॥ తల్లిదండ్రి దైవమనుచు యుల్లమందు నమ్మి మిమ్ము
తరుణమిదె తలఁచినాను నాథ సరగఁ బ్రోవవే॥ మీ॥

శరణనుచు మీకు నేను సారెకును మ్రొక్కెదను
అభయ మొసఁగి బ్రోవుమయ్య హానాథ నీవేగతి. మీ॥

నాథా ! సర్వము మీరేయని నమ్మి మీపాదపూజ జేసితి. నీ యబలపై నెన్ని తప్పులుండినను మన్నింపవలెను.

పప్పుసెట్టి.—ప్రియా ! నీపై ఏతప్పులు లేవు అదిగో మనగురువు గారు వచ్చుచున్నట్లున్నది చూడుము.

భక్తవిఠో.—(ప్రవేశము.)

(కామిసత్యభామ అను వర్ణమెట్టు)

రా—హిందుస్థాని బ్యాగు. తా—ఆది.

ప॥ దేవా ననుబ్రోవ నీకింత జాలమ

అ॥ జాలమ జాలమ జాలమా జాలమ ఓ
దేవా యిది జాలమా॥ దేవా॥

చ॥ దీనుడనై నేనీ దిక్కని నమ్మితిరా
దీనుని నన్ను బ్రోవుమ
బ్రోవుమ బ్రోవుమ బ్రోవుమా బ్రోవుమ ఓ
దేవా ననుబ్రోవుమా. దేవా॥

పప్పుశెట్టి, కమల —(ముందుకువచ్చి) గురువర్యా!నమస్కారము.

భక్తవిఠో:—సుఖంబుగా వర్ధిల్లుడు.

(కమలనుజూచి) అమ్మా! నేనుచెప్పినట్లు నడచుకొనుచున్నావా?

కమల:—దేవా! మీయాజ్ఞ చొప్పున నడచుకొనుచున్నాను. మీకృపవలన మాకేకష్టములును లేవు.

భక్తవిఠో:—అమ్మా! పతివ్రతమహిమ తెలిసినదా?

కమల:—స్వామీ! తెలిసినది. నాకెన్నడు మోక్షము గలుగును?

భక్తవిఠో:—అమ్మా! ఇట్లె కొలదికాలము ప్రవర్తించితివేని, భగవంతుడు మెచ్చి సతీపతులగు మీయిరువురకు మోక్షం బియ్యగలఁడు.

కమల:—దేవా! అలాగే ప్రవర్తించెద.

భక్తవిఠో:—(సెట్టిని జూచి)

అయ్యా! మీకు సంతోషము గలిగినదా ?

పప్పుసెట్టి:—దేవా! మీకృపచేత నాభార్యకు పతిభ_క్తి గలిగినది. మేము సుఖ మనుభవించుచున్నారము.

భ_క్తవిఠో:—అట్లే సుఖముగా వర్ధిల్లుడు నేవచ్చెద.

పప్పుసెట్టి:— మీ యాశీర్వాదమువలన మే మీయగల గురుదక్షిణాగ్రైకొని చనుఁడు.

భ_క్తవిఠో:—అలాగే కానిండు. (అని కుర్చీపై కూర్చుండును.)

పప్పుసెట్టి, కమల:—(పూలహారము మెడయందు అలంకరించి దక్షిణ తాంబూలాదు లిచ్చి) దేవా! నమస్కారము.

భ_క్తవిఠో:—శ్రీపాండురంగని కృపచే సుఖముగా నుందురుగాక. అయ్యా నావెంబడించి ఆచెంగయ్యరూప్యములు గ్రైకొనిపొండు.

పప్పుశెట్టి:—దేవా! నాకా రూప్యములు వలదు మీ కృపయున్నచో చాలును.

భ_క్తవిఠో—మీకు శుభంబుగలుగుగాక

పప్పుసెట్టి:—కమలా! వీరికృపచేత మన కష్టము లన్నియు తీరె మనకెంత దైవభ_క్తి కలిగినదో చూచితివా.

కమల:—నాథా! అన్నియు దైవసంకల్పమే కాని వేరు గాదు. ఇందులకై యోచింపవలదు. రండు. (అని నిష్క్రమింతురు)

తెర వాలును.

---

(రంగము పై) రోడ్డు.

(నారదుఁడు ప్రవేశము.)

రా—కురంజి. తా—ఆది.

ప|| మురారి నాదగు మొరాలకింపర
సరోజ లోచన పరాత్మరా హరి మురారి||

అ|| సురారి మర్దన గిరిధరా హరి
పరాకేల ననుబ్రోవరా హరి మురారి||

అదిగో భ_క్తవిఠోబా వరంబులర బడసి వచ్చుచున్నాఁడు. వారి గృహమున సతిసుతుడు చింతిల్లుచున్నారు. 'గాన హరివద్దకేఁగి వారికీవిష యంబులం దెల్పి నూరార్చెదను.

రా—సురంజి. తా—ఆది.

చ॥ ఆనందజనకా వినమ్రుండనై మనంబున నిను వేడితి
ఘనంబుగా నను దినంబుప్రోంగ నను
దయజూడరా హరిమురారి॥

(నిష్క్రమించును.)

తె ర వా లు ను.

(రంగము. 4) రాజగృహము.

(రతీదేవి, సుందరి ప్రవేశము)

రతీదేవి:— రా—భీంపలాస్. తా—రూపకం.

ప॥ హాసఖి నేనేమిచేతు తాళజాలనే భువి
అ॥ పాపిదైవ మిటులవ్రాసె యేమిసేతు నీవిధి॥ హా॥
చ॥ ప్రాణనాథు విడనాడి పాపినైతినే చెలి
తాళజాలనే నింక ధరణినిల్వనే మరి॥

చెలీ, నానాథుండు రాజ్యంబు విడిచిపోయి యింకను రాకున్నారు. నేనింక జీవింపజాలను. నాప్రాణములు తీసికొనియెద. నీవు నాపుత్రుని కాపాడు చుండుము.

(అని వెంట్రుకలు తీసికొని ఉరివేసికొన బోవును.)

సుందరి:—(వెంట్రుకలు పట్టుకొని) అమ్మా వలదు. రాజుగారు రాగలరు. మీరుచింతింపకుఁడు (అని ఇటునటు చూచి)

అమ్మా! అదిగో చూడుడు. తమకుమారుఁడు వచ్చుచున్నాడు.

సీనసింగ్:—ప్రవేశము. (దర్బార్ వర్ణమెట్టు)

రా—మధ్యమావతి. తా—రూపకం.

ప॥ దేవా నను కృపజూడుమా దేవా.
అ॥ దీనుని నన్ బ్రోవుమయ్య దేవా.
చ॥ ఇలలో నీ సరిదైవము ఎవ్వరులే రరయంగా
కరుణాకర నన్ను బ్రోచి కావుమయ్య వేగమే దేవా.

(తల్లివంక జూచి.)

అమ్మా! ఏలదుఃఖించెదవు? ఎందువలన మీకీదుఃఖముగల్గె?

రా—కాపి. తా—ఆది.

ప॥ ఎందుకు తల్లీ యీదుఃఖంబు మీకు
చాలచింత నొందనేల॥ ఎం॥

అ॥ తనయుఁడు నేనుండ తగదిట్టి దుఃఖంబు
జననిరో తెల్పవే సరగుననాతో॥ ఎం॥

చ॥ కన్నుల నీరిటు కారుట ఏలనో
వేగమె దెల్పుమా వెఱపింత లేకను॥ ఎం॥

తల్లీ! ఏల కన్నీరుంచెదరు? ఏల నామాట లాలకింపరు? అమ్మా! ఏల బదులు వక్కాణింపరు? తల్లీ! ఏల ఈదుఃఖము?

గీ॥ తల్లి యేటికి దుఃఖంబు తనయు డుండ
నకట నీకిట్టి సంకట మరయ నెవఁడు
గలుగ జేసెనొ వానిని గఱిమి ద్రుంతు
నిక్కముగ జెప్పగదే నీకు మ్రొక్కువాఁడ.

(అని పాదములపైబడి మ్రొక్కును.)

రతీదేవి:—కుమారా! లెమ్ము. నేను దిక్కులేనిదాననై నిన్ను జూచి వున్నదుఃఖము లేదనుకొని లేనిసంతోషము వున్న దనుకొని యెట్లో కాలము గడుపుచుంటిని. నీడచే ద్రుప్పుడగువానికి దావాగ్ని జుట్టుకొన్నట్లు నాపతి దుఃఖము నన్ను పీడించుచున్నది. నా ప్రాణ పదమగు నీతండ్రిగారు లేరైరి. వారినిజూడక యిక నొకక్షణమైనను నేను ప్రాణములను భరింపజాలను తనయ!

సీనసింగ్:—అమ్మా ఏమి జెప్పితిరి? మాతండ్రిగారు లేరా? వారెం దేగిరి? వారివృత్తాంతము దెల్పుము.

రతీదేవి:—నీతండ్రిగారు గృహము విడిచి తపస్సునకేగి యిప్పటి కేడేండ్లాయెను. ఇంకను రారైరి. వారెట్లున్నవారో? యెందున్నవారో? నాకుం దెలియదాయె.

సీనసింగ్:—అమ్మా! తండ్రిగారు వెళ్లి యేండేండ్లాయెనా? వారు యెందులకై తపస్సున కేగిరి.

రతీదేవి:—తనయా! శ్రీహరిని ధ్యానించుటకై అరణ్యమునకేగిరి.

సీనసింగ్:—వారికా విషయ మెట్లు దెలిసెను?

రతీదేవి:—నారదమునివర్యులచే.

సీనసింగ్:—అమ్మా! వారెవరు? యెందుండువారు?

రతీదేవి:—కుమారా! వారు త్రిలోక సంచారులు. బ్రహ్మదేవుని పుత్రులు. బ్రహ్మలోకమున నుందురు.

సీనసింగ్:—అమ్మా! అటులైన వారిని స్తుతించెద. వారు వచ్చి రేని మాతండ్రిగారివృత్తాంతము దెలియవచ్చును గద

రతీదేవి:—పుత్రా! ఎట్టి వెఱ్ఱిమాటల నుడివెదవు? వారిని నీవు స్తుతించినంతమాత్రమున వారిందు రాగలరా?

సీనసింగ్:—ఇదేటివింత. శ్రీపురాణపురుషుండగు శ్రీమన్నారాయణ మూర్తి యెల్లరకు తోడైయుండ నన్నేల రక్షింపడు? అట్లురక్షింపనిచో యిదిగో (అని కత్తిదూసి) ఈఖడ్గంబుచే నాశిరస్సును ద్రుంచుకొనెదను చూడుము.

రతీదేవి:—తనయా! వలదు వలదు. ఊరడిల్లుము.

సీనసింగ్:—హే పరంధామా! లోకాభిరామా! నేను నీకు దాసుడనైతినేని యీక్షణంబున యా నారదమునివర్యులచే నాతండ్రి గారి వృత్తాంతమును దెల్పితిరేని సరి. లేనియెడ నేనీఖడ్గముచే నాప్రాణం బులఁ బాపికొనెదను. హే త్రిలోకవాసా! బ్రహ్మపుత్రా! యోనారద మునివర్యా! నీదాసుడను. శరణు వేడెదను.

(అని కూర్చొని)

రా—ఇంగ్లీషునోటు. తా—ఏకం.

ప॥ శరణువేడెద ఓనారదవర్యా

అ॥ శిశు వటంచునన్ చెలిమి బ్రోవుమా

చ॥ నాదగు తండ్రియానతి దెల్పి నన్నిటుబ్రోవుమయ్యా
ఈబాలుని యాపద బాపివేగమె
ప్రాణముల్ నిల్పుమయ్య॥

(లేచి) హేదేవా! శరణని బాలుడనగు నేనువేడుచుండ నామొ రాలకింపరాదా, అటుగాక నన్నురక్షింప నీకు కరుణలేదా. ఇదె నేనీ ఖడ్గముచే ప్రాణముల ద్రెంచికొనెదచూడు. (అని కత్తిపైకెత్తును.)

నారదుఁడు:—(ప్రవేశము.) బాలకా! వలదు వలదు. తాళుము.
(అని కత్తిపట్టుకొనును.)

రతీదేవి:—దేవా! నమస్కరించెదను.

సీనసింగ్:—ఆర్యా! నమస్కారము.

నారదుఁడు:—అమ్మా! శుభమస్తు. బాలకా! సుఖముగావర్ధిల్లుము.

రతీదేవి:—దేవా! నాప్రాణవిభుఁ డెందున్నవారు? అతని క్షేమములం దెల్పి మమ్ము కృతార్థులం జేయుము.

నారదుఁడు:—శీలయగు రతీదేవి! నీ భర్త సుఖముగా నున్నవాఁడు. నీవు చింతిల్లకుము.

సీనసింగ్:—ఆర్యా. మాతండ్రిగా రెందున్నవారు?

నారదుఁడు—బాలకా! నీతండ్రి కొలఁదిరోజులు అరణ్యమున దపంబాచరించి ఆవల భక్తులం గూడి పండరి క్షేత్రమున కరిగి భగవంతుని చే వరంబులం బడసి వచ్చుచున్నవాఁడు.

సీనసింగ్:—ఏమి? మాతండ్రిగారు వచ్చుచున్నారా?

నారదుఁడు:—బాలకా! అదిగో వినుము. ఏదో ఒకచప్పుఁడు వినబడుచున్నది.

(అని యందరు ఆలకించెదరు.)

భక్తవిజో:—(ప్రవేశము)

రా—హిందుస్తానీ కాపీ? 

రా—హిం బ్యాగు. తా—ఆది.

ప॥ మానసంబున ఆనందమాయె ఆనందమాయె
బ్రహ్మానందమాయె॥ మా॥

అ॥ యిలలో శ్రీమన్నారాయణ స్మరణ నాకాయె
మరల జన్మంబే యునాకు లేదాయె॥ మా॥

చ॥ పరమాత్మనీ నామమె దిక్కాయె యిహలోక
వాసంబు నాకు లేదాయె॥ మా॥

(నారదునిం జూచి)

గురువర్యా! నమస్కారము.

నారదుఁడు:—రాజా! భక్తుఁడై వర్ధిల్లుము.

రతీదేవి:—ప్రాణనాథ! నమస్కారము.

శీనసింగ్.—శంభ్రశ్రీ! నమస్కారము.

భక్తవిభో—శుభంబు గలుగుగాక.

[నారదుని జూచి] దేవా! మీ రిందేల యేతెంచితిరి.

నారదుఁడు—రాజా! నీ సతీపుత్రులకు నీవిషయముం దెల్పుటకై వచ్చినాడ.

భక్తవిభో—దేవా! మీరీ దుష్టునకు చేసిన యుపకారమునకై నేను మిమ్మెంతని పొగడగలను

నారదుఁడు—రాజా! అదియటుండనిమ్ము. శ్రీహరిని జూచితివా ?

భక్తవిభో—శ్రీహరినిం గంటిని. వరములం బడసితిని.

నారదుఁడు—రాజా! నీకు హరి యేవరం బొసగెను?

భక్తవిభో.—ఆర్యా! ఇంక కొలదికాలము నీవు నీరాజ్యంబున నుండు జనులకు భక్తి గరపి వచ్చితివేని, మోక్షం బొసగెదనని వరం బొసంగెను.

నారదుఁడు.—అటులైన నిన్ను వెంబడించిన భక్తులేమైరి?

భక్తవిభో—వారికి మోక్షం బిచ్చెద ననిరి.

నారదుఁడు—నీకు యేలమోక్షంబియ్యడాయె? నీమతంబెయ్యది?

భక్తవిభో.—దేవా! నామతంబు.

గజల్॥ సమస్త లోకములకెల్ల వెలసెడి
సర్వేశ్వరుఁడౌ హరిని నెపుడు
చిత్తములోన మరువక నామది యందున
దలచునదే నామతంబు మౌనివరేణ్యా॥

దేవా ! అగోచరుండై ఆనందుడై నిత్యస్వరూపుఁడై వెలయు శ్రీహరినామమే సదా నమ్మియున్నాఁడను. ఇదే నామతంబు ప్రభో.

నారదుఁడు—రాజా! నీభక్తికి మెచ్చితిని. నీవు నీరాజ్యంబునం గల జనుల కందరికిని భక్తిమార్గముపదేశించి సత్ప్రవర్తనలం బొంది శ్రీహరిని ధ్యానించుచుందువేని నీకు మోక్షంబొసంగును.

భక్తవిభో.—దేవా ! మీరు జేసినట్టి యుపదేశమునకు నేను మీకు పాదసేవ జేయవలయునని కోరుచున్నాఁడను.

నారదుఁడు—అలాగే కానిమ్ము. [అని కుర్చీపై కూర్చుండును.]

భ_క్తవిజో, రతీదేవి, సీనసింగ్.— [మెడయందు పూలహారము వేసి హారతినిచ్చి]

రా—నాట తా—ఆది.

ప॥ మౌని వర్యా మీదు మాయలేమొ దోచవయ్యో
నహహా మౌనివర్యా.

అ॥ దేవా! మీదుపాదమె దేవా మీదుపాదమె
నెరనమ్మితిమి బ్రోవుమయ్యా సరగున మౌనివర్య॥

దేవా! నమస్కారము.

నారదుఁడు:—సుఖముగా వర్థిల్లుడు.

భ_క్తవిజో —సఖి! జూచితివా. వీరికృపచేత నెంతభ_క్తి గలిగినది. ఇక మనరాజ్యంబున జనులందరికి భ_క్తిని యుపదేశించినయెడల యెవరి కేకష్టములుఁ గలుగవు

రతిదేవి —మీయిష్టానుసారంబుగా నొనర్పుఁడు.

భ_క్తవిజో.—(పుత్రునిజూచి) తనయా! నీవు సేవకులంబిలచి మన రాజ్యంబున నుండు జనులంధ్దరిని రేపుసాయంకాలమున సభాస్థలంబునకు రమ్మని తండోరావేయ ను_త్తరవిమ్ము.

సీనసింగ్.—తండ్రీ! చాలా నే చేసెదను.

ఓరీ! సేవకులారా!

సేవకుఁడు.—దేవా! నమస్కారము.

సీనసింగ్.—పురంబునకేగి రాజాజ్ఞం దెలిపి రేపు సాయంకాలమున జనుల నందరిని సభాస్థానమునకు రమ్మని తండోరా వేయించుము.

సేవకుఁడు.—ఆలాగే వేయించెదను ప్రభో. (నిష్క్రమించును.)

నారదుఁడు —(లేచి ముందువచ్చి) రాజా! మీరు శుభంబుగావర్థిల్లుడు నేనొచ్చెద.

(ముందు తెర వాలును)

సీ॥ స్వర్గలోకములోన సరవిగా దేవతల్
సమ్మతించక నన్ను దూరనాయె
కాననంబున ఋషుల్ గణుతించి నన్నెపుడు
నిందలే నాపైకి నింపనాయె

సత్యవై కుంతముల్ సహజంబుగను నేగ
పరదోషియించును బలుకరైరి
మర్త్యలోకంబునందు మనుజులు ననుగూడి
కలహప్రియుడంచు నర్గ నుడువనాయె
తే. ఏలనోచన బుట్టకే ఈరీతి దిట్టరైరి
నేను జేసెడి నుపకార చర్యలన్ని
మునుముందు సుఖముల మెనయునపుడు
ఎఱుక గలిగించు భువిలోన దూరరెపుడు.

(తెరవాలును.)

---

# పంచమాంకము.

---

(రంగము 1.) సీనసింగ్ దర్బారు.

మంత్రి సైన్యాధిపతి వచ్చి కూర్చొనియుందురు.

సీనసింగ్.—[వచ్చి సింహాసన మలంకరించెను]

అందరు.—సీనసింగ్ మహారాజుకు జై!

సేవకుడు—(ప్రవేశించి) దేవా! మనపురమెల్ల తండోరా వేయించినాడను.

సీనసింగ్—సరే, అగుము.

పురజనులు.—(గుంపుగా ప్రవేశము.)

భక్తవితో.—(ప్రవేశము)

(కోరిభజింతు అను వర్ణమెట్టు.

రా—బింప్లాస్. తా—ఆది.

ప॥ చేరికోర్చెదను శ్రీరంగా మది చింతదీరఆనందున్ ఆ ఆ ఆ ఆ॥

అ॥ శ్రీపాండురంగని చిత్త విచారణి చింతలు దీర్చేటి రంగా॥ చేరి॥

చ॥ నిన్నువినాగతి వేరెవ్వరులేరు నన్ను బ్రోవుమయ్య ఆ ఆ ఆ ఆ॥
శ్రీరంగన్ చిత్తచోరన్ భక్తాప్రియ విలాసున్
కరుణానంద మనోవికాసున్.

సీనసింగ్ —[సింహాసనముదిగి] తండ్రీ! నమస్కారము.

భక్తవిఠో.—మంగళంబగుఁ గాక. [అని సింహాసన మలంకరించి]

సీనసింగ్.—తండ్రీ ! ఇదిగో పురజనులెల్లరు వచ్చియున్నారు.

జనులందరు.—దేవరవారికి వందనములు.

భక్తవిఠో.—సుఖముగా వర్ధిల్లుడు. మిత్రులారా! మనరాజ్యంబున యింతవరకును దెలియక దుష్టకృత్యంబుల జేయుచు అమిత పాపముల పాలైతిమి. ఇప్పటికి యీ నారదవాక్యులచే జెప్పఁబడిన సద్భక్తి మీకు దెలియజేయుటకై మిమ్మిచ్చటికిరప్పించితిని. మనకీజన్మము యెనుబది నాలుగు కోట్ల జీవరాసులందు బుట్టుచు గిట్టుచు పలుహింసలంబడుచున్నది గాన యీ జన్మమునకు మూలాధారమై యున్నట్టి యీ శరీరము.

శా. పోకన్ మానదు దేహమే విధమునన్ పోషించి రక్షించినన్
రాకన్ మానదు హానివృద్ధులు మహారణ్యంబులో దాగినన్
కాకన్ మానదు పూర్వజన్మకృతముల్ గాగల్గు నర్థంబులన్
లేకన్ మానదు యెంతజాలిపడినన్ లేముల్ సిరుల్ రాఘవా.

అనురీతి యీ దేహము యే కాలమునకు యే కష్టసుఖంబుల ననుభవింప వలెనో అట్టివి యనుభవించుచున్నాము. గాన నింక యట్టివాటికి దారి యియ్యక యెల్లప్పుడు భగవన్నామస్మరణ జేయుచు సద్భక్తిం బొందియుండవలెను. అట్టి మంత్రము మీకుందెల్పెదను. మీరెల్లరును యారీతిని నుడువుడు.

అందరు.—ప్రభో ! ఆలాగే నుడివెదము.

భక్తవిఠో.—(మంత్రోపదేశము)

రా—ఇక్ నోటు. తా—రూపకం.

ప|| హారేవిటల్ హారేవిటల్ విటల్ విటల్ హారేహారే
అ|| హారేరంగ హారేరంగ పాండురంగ హారేహారే
సద్గురు పాండురంగకీజే.

ఈ మంత్రమును ఎల్లప్పుడును మరువక స్మరించుచుండు రేని మోక్షము గలుగుచున్నది.

అందరు.—ప్రభో! అట్లేనుతించెదము.

నారదుఁడు.—(ప్రవేశము.)

రా—మధ్యమావతి తా—రూపకం.

ప॥ శ్రీపతినిను నెరనమ్మితి చింతదీర్చవే శ్రీపతి॥

అ॥ గోపతినుత నీవేగతి పాపతిమిర పంకజపతి శ్రీపతి॥

చ॥ ఆనఘానిను గొనియాడం గనునేరికి దరమగునిక
సుమసాయక జనకాత్తగు సమయ మిదే రాపరాక. శ్రీపతి॥

భక్తవిలో.—(సింహాసనముదిగి) గురువర్యా! నమస్కారము.

నారదుఁడు.—రాజా! మంగళంబగుఁగాక. ఈ పురజనులకెల్ల దెల్పితివా?

భక్తవిలో.—దేవా! తెల్పితిని.

నారదుఁడు.—అటులైన నీకై కృష్ణపరమాత్మ వేచియున్నాఁడు. త్వరగా సతీపతులు నావెంటరండు ద్వారకకు పోవుదము.

భక్తవిలో.—దేవా! ఆలాగే వచ్చెదము (అని నిష్క్రమింతురు.

సీనసింగ్—మంత్రీ! నాతండ్రిగారి యాజ్ఞానుసారముగా మనపురంబునగల జనుల నిక యెట్టి దుష్కార్యములు జేయక దైవభక్తి కలిగి ప్రవర్తించునటుల జేయుము.

దుష్టబుద్ధి—దేవా! ఆలాగే జేసెదను. (నిష్క్రమింతురు.

తెరవాలును.

(రంగము. 2) రోడ్డు.

హాస్యగాఁడు.—(ప్రవేశము)

అబ్బ అబ్బ చాలు. ఈరాజుగారి వుత్తరవు ప్రకారం యీపురమంతా తిరిగి చెప్పినమాత్రమున యెటులున్న దనగా చెప్పెదను. అది మీరందరు సద్దుచేయక ఆలకింపవలయునని కోరిక.

రా—తెమ్మాంగు. తా—ఏకం

ప॥ దిగ్గుమని మెరసేను. ఇదియేమో వింతగా

అ॥ చూడంగ చూడంగ సుందర మైనట్టి డ్రామా॥ దిగ్గు॥

చ॥ భూలోకమందున బుద్ధి గల్గు మంత్రము
భువనేశ్వరులకెల్ల భుక్తి నొసగు తంత్రము॥ దిగ్గు॥
కలియుగమందున కన్నెల కందరికిని
కారుణ్యమునిచ్చే కరుణ గల్గు మంత్రము॥ దిగ్గు॥
చెన్నపురి యందున చిన్నమునుసామి కవి
చింతలెల్లదీర్చెటి చిన్మయ మంత్రము॥ దిగ్గు॥
అయ్యలార అమ్మలార అందరు యీపుస్తకం
ఆనందముతో తీసి అందరికి జూపుడు॥ దిగ్గు॥

(నిష్క్రమించును)

తె ర వా లు ను.

(రంగము ౩) శ్రీకృష్ణదర్బారు.

(గోపికలు ప్రవేశము)

కోమలవల్లి.— రా—శ్రీ రాగము. తా—ఆది.

ప॥ ఇందే వెదకి చూతాము రారే గోపాల కృష్ణుని ఇం॥
అ॥ ఇందు వెదకి జూచి అందరము గూడి
ఆశదీర ఆ లింగన మొనర్చ॥ ఇం॥

ఆహా! చూచితిరే వారు కొలువుదీరు సింహాసనము యెంత రమ్యముగా నున్నదో.

శేషాంగన.—అమ్మా! వారి సింహాసనమే యింత యందముగా నున్న వారెంత యందముగా నుందురు?

రంగనాయకి.—అవునమ్మా. వారెందున్నారో వెదకిచూతాము రండు.

చంపకవల్లి.—వారిని వెదక నేల ? ఇందే వుండఁగలరు కూర్చుందుము. ధ్యానించెదము. (సింహాసనమువద్ద యందరు కూర్చుండుట.)

(ఇచ్చట దశావతారములు గనబడును.)

(ఓహో రాకుసులారా అను వర్ణ మెట్టు.)

రా—బిలహరి. తా—చాపు.

ప॥ దేవాదిదేవ ఓ దివ్యసుందర నేత్ర నీ
దివ్యరూపముల్ జూపి దీనుల బ్రోవుమా॥ దే॥




శ్రీకృష్ణమూర్తి గోపికలచే జలక్రీడ లాడుట.

అ॥ మత్స్యవతారమెత్తి సోమకాసురుని ద్రుంచిన
యా మత్స్యావతారమెత్తి మమ్ము బ్రోవుమయ్య॥ దే॥
చ॥ కూర్మావతారమెత్తి సురులను బ్రోచిన
యా కూర్మరూపముజూపి కూర్మితో బ్రోవుమయ్య॥ దే॥
వరహావతారమెత్తి హిరణ్యాక్షుని ద్రుంచిన
యా వరాహరూపుజూపి యీ వనితల బ్రోవుమయ్య॥ దే॥
నరసింహావతార మెత్తి హిరణ్యకశ్యపుని ద్రుంచిన
యా నరసింహరూపుజూపి అతివల బ్రోవుమయ్య॥ దే॥
వామనావతారమెత్తి బలిని బ్రోచినయా
వామనరూప మెత్తి మావాంఛ దీర్చుమయ్య॥ దే॥
పరశురామావతారమెత్తి కార్తవీర్యుని ద్రుంచిన
యా పరశురామరూపుజూపి ఈ పణతుల బ్రోవుమయ్య॥ దే॥
శ్రీరామావతారమెత్తి రావణాసురుని ద్రుంచిన
యారామావతారమెత్తి రమణుల బ్రోవుమయ్య॥ దే॥
శ్రీకృష్ణావతారమెత్తి దుష్టకంసుని ద్రుంచిన
యా కృష్ణరూపము జూపి ఈ భక్తుల బ్రోవుమయ్య॥ దే॥

(శ్రీకృష్ణుడు ప్రత్యక్షము.)

అందరు.—దేవా! నమస్కారము.

కృష్ణుడు.—గీ. కాంతలార నేను గాంచితి మీభక్తి
కరుణతోడ నిత్తు వరము గోనుడు
నన్ను నమ్మి కొల్వు నాభక్తులకు జన్మం
లేదు లేదు జగతి లేదు నిజము

గోపీరమణులార! మీభక్తికి మెచ్చితిని. మీకు త్రేతాయుగంబున నిచ్చిన వరమునకై వేచియున్నవాడను మీ యిష్టానుసారము వరము వేడుడు యిచ్చెదను.

గోవిందవల్లి.—దేవా! మీ ముఖారవిందము జూచిన మాత్రమున యేదో నొకవిధముగ మనస్సు గల్గుచున్నది గాన యితరముల యందు మామనస్సు పోలేదు.

కృష్ణుడు.—అది యెయ్యది?

(గోపికలు కృష్ణుడు తర్కము)

గోపికలందరు.— రా—బ్యాగు. తా—ఏకం.

నిన్ను జూడ మోహమబ్బె గోపాల
ఆహా ఆహా హా నమస్తే
మాదుమోము దీర్చిబ్రోవు గోపాల
ఆహా ఆహా హా నమస్తే.

కృష్ణుఁడు.— కరుణతో గోవిందసఖి కామినిరో
ప్రియసఖి ప్రాణసఖి స్నేహసఖి యిష్టసఖి భామరో,

గోపికలందరు.—నిన్ను మేము దలచితిమి బ్రోవవె
ఆహా ఆహా హా నమస్తే.

కృష్ణుఁడు.— యింపుతోడ యిచ్చెదను ఇలలో వరములను
కైకొనుమ చేకొనుమ వేగమె భామరో.

(కోలాటము కృష్ణుడు మధ్యనిలుచును.)

గోపికలందరు — రా—కాంభోజి తా—ఆది.

ప॥ నీలమేఘ శ్యాముడె యీ నిత్యపరంజ్యోతియే
అ॥ లీలావిభూతుడే నిత్యకల్యాణుడె
నందయశోదా నందనుడె అ॥ నీల॥
నందుడెగో విందుడె ఆ నందుడే శ్రీ కృష్ణుడె
అందరము యీ సుందరుని గూడి
పొందుగ మోక్షము వేడెదమె॥ నీల॥

నారదుఁడు —(ప్రవేశము)

రా—మాండు తా—ఆది.

ప॥ గోవర్ధనగిరి గోపరిపాల గోకులనందన గోపీలోల
అ॥ శ్రీధరనంద యశోదకుమార శ్రీధరరుక్మిణి రాధాలోల
చ॥ బ్రోవవెనన్నిటు కావగరావే శ్రీధరదేవకి దేవకుమార.

కృష్ణుడు —నారదవర్యా ! నమస్కారము.

నారదుఁడు —శుభమస్తు.

భక్తవిజయో, రతిదేవి —దేవా ! నమస్కారము. (అని కూర్చొని)

గజల్॥ ద్వారకాపురివాసా ! కృష్ణా ! భవ్యచరితా !
భక్తపోషక ! హే రుక్మిణీ ప్రాణనాథ !

దేవరను గాంచవచ్చిన వీరలైన యీ
భక్తుల కరుణతో నేలుమయ్యా
ప్రభూ! మమ్ము రక్షింపుము.
కృష్ణుఁడు — మీకు శుభము గలుగు గాక. లెండు.

(నారదుని జూచి)

నారదా! వీరిని వెంటఁదోడ్కొని వచ్చిన కారణం బెద్ది?

నారదుఁడు — కృష్ణా! సకలచరాచరంబులకు ఆధారభూతుఁడవై, లోకరక్షకుఁడవై సర్వమును తెలిసిన నీవు నన్నేల యడిగెదవు?

కృష్ణుఁడు. — ఆర్యా! మీతలం పెద్దో తెల్పుము.

నారదుఁడు. — కృష్ణా! ఈ భూలోకమందు మిమ్ము సదా నుతించెడి ఈభక్తులకెల్ల మోక్షంబొసగి వారి కెట్టికష్టములు లేక కాపాడ వలయుననియే నాతలంపు

కృష్ణుఁడు. — ఆర్యా! ఎట్టి దురాత్ముఁడైనను నన్నుం దలచునేని యట్టివానికి నేను యేకష్టములును బొందనీక కాపాడుచుండువాఁడను. అది మీ రెరిగియు వీరి నేల దోడ్తెచ్చితిరి?

భక్తవితో. — దేవా! అటులుండ నన్నేల బ్రోవనెపరు. మీరు-

సీ. అలనాడు ద్రౌపతి యార్తితో వేఁడఁగ
కడువడి మానంబు గాచినావు,
అన్నఘాతకు భీతినంది గుందుచునున్న
సుగ్రీవు దయతోడ జూచినావు
శబరి యిచ్చిన పండ్లు సరగున గైకొని
యింపుగా మోక్షంబు నిచ్చినావు,
హరిసోదరుడంచు నాత్మ నెంచక నీవు
విభీషణునకు శరణం బొసఁగినావు,
గీ. ఇట్టి దెల్లను నేను వీక్షించి యెరుగ
యిపుడు మోక్ష మొసగి నను బ్రోతువేని
నీదుమహిమ నిజంబని యెన్ను కొందు
బ్రోవకుందువే ప్రాణముల్ విడుతు నిదిగో.

(అని కృష్ణుని కాళ్లపైబడును)

కృష్ణుడు —భక్తచింతామణీ! నీభక్తికి మెచ్చితి. లెమ్ము.

నారదుఁడు —కృష్ణా! అది తెలిసియుండ ఏల కాలతామసము చేసెదవు ?

కృష్ణుఁడు —ఆర్యా! ఈభక్తశిఖామణికై వేచియుంటిని. ఇంక నాలస్యమేమియును లేదు రండు వీరికి మోక్షంబొసఁగి వైకుంఠమునకు వెళ్ళుదము

నారదుఁడు —అలాగే కానిమ్ము

(అని గోపికలు, కృష్ణుఁడు, భక్తవిఠో, రతీదేవి, నారదుఁడు.
సింహాసనముపై నెక్కుదురు.)

అందరు.—హారతిగైకొని

రా—ఇంగ్లీషు నోటు. తా—ఏకం,

పll సదాశివజీవేశ - శ్రీశా

అll సుధారమ్య - సుగుణప్రకాశ

చll విధాదారి - వేల్పులపోషా-ముమ్మాడు
శ్రీవెంకటేశ.

మునివరుల-కరుణగునీ
ముచ్చటలె-పొగడుకొని
పదములను-పాడుచు-సొంపుగా
నీయమ-నామములోనె
కొలువే సున దారసమై
అంసో అంసో-అంసో సాధులై
శ్రీపెరుమాళ్ విలాస సభవారు
తాపములోనె దీర్ఘాయులై-బొందిరి
మంగళముల

మంగళం. మంగళం. మంగళం.

శ్రీ భక్తవిఠోబానాటకము.

సంపూర్ణము.

---

# విఠోబా నాటకమునకు

## ప్రాతఃకాలబోధ.

---

ఆర్యులారా !

ప్రతి మనుజుఁడును ప్రతిదినము ప్రాతఃకాలమున 4-30 ఘంటలకు నిద్రలేచి నిర్మలచిత్తుఁడై, శంభో! మహాదేవా! శంకరా! నారాయణా! గోవిందా! అని మరల.

మ. స్థిరమై నిర్మలమై మహావిభవమై చిన్మాత్రమై సత్యమై
పరమై సంతత సాయమీశ్వరమనః ప్రత్యక్షమై నిత్యమై
దురితారణ్య దవార్చియై మౌని భక్తుల్గోమ వర్ణంబునై
స్థిరభావంబున దోఁచుబ్రహ్మము మదిన్ సేవించు తత్వార్థినై

చ. అవికలభక్తినెవ్వని మహాత్ములు చిత్తమునందు జేర్చిబా
హ్యావిరతి బూని సత్కృప సమర్పణ లొప్పగ నర్థిఁ జేయుచుం
దవిలి సమాధియోగముల దత్పరులై భజియించి మృత్యుపా
శవిరహులై సుఖింతు రనిశంబును నాహరి కేను మ్రొక్కెదన్.

అని ధ్యానముజేయుచు పరమేశ్వరా నేనుజేసిన పాపములను బోఁగొట్టి మీరు నన్ను అనుగ్రహించవలయునని ప్రార్థించి పడకనుంచి లేచి అప్పటికి సూర్యోదయము కాకపోయినను కన్నులు మూసుకొని సూర్యుని మనస్సున ప్రతిబింబించుకొని,

శ్లో. ఉదయం బ్రహ్మస్వరూపం మధ్యాహ్నంతు మహేశ్వరమ్,
అస్తమానం స్వయం విష్ణుః త్రిమూర్తిశ్చ దివాకరః

అని ఈమంత్రముచేనుతించి, ఓత్రిమూర్తిస్వరూపుఁడా! ఓసూర్య భగవంతుఁడా! నేను చేయునట్టి సర్వకార్యములయందును సంపూర్ణ తేజస్సును గలుగజేసి నన్ను మీ యనుగ్రహమునకు పాత్రుని జేయుము అని ప్రార్థించి, పైమంత్రము పఠించుచు మూడుమార్లు ప్రదక్షిణముజేసి, తలిదండ్రులకు సంపూర్ణమైన భక్తితో ప్రదక్షిణనమస్కారాదు లొసర్చి, వారిచే యాశీర్వచనముల పొంది, గడచిన దినమునందు తాను జేసిన

పుణ్యపాపకర్మములను స్మరించి, పశ్చాత్తాపపూర్వకముగా చింతింపవలయును. ఈధర్మములన్నియును సూర్యోదయము కాకమునుపే చేయవలయును. సూర్యోదయానంతరము లేచిన యెడల ప్రత్యక్షముగా దర్శించి స్తుతింపవలయును. ఈ ప్రకారము ప్రతిరోజును ఆచరించుచున్న పక్షమున, యిహమునందు కీర్తియును, పరమునందు మోక్షమును పొంది సుఖించుటయును గాక మనస్సు శుద్ధమై యుండును. అట్టివారికి యేకష్టములును గలుగవు. వెనుక, యిల్లువెడలి మలమూత్రములను విసర్జించి, దంతధావళ్యమును జేసికొని స్నానమును జేయవలయును.

ఆర్యులారా! ప్రతివారును యిహలోక సుఖములను నమ్మక, పరలోకమున గల్గునట్టి సుఖమును నమ్మి పై ధ్యానమును మరువకుడు.

యెడమ ముక్కున ప్రాణవాయువును కొంతమాత్రము (కొంచెము కాలమైనను) పూరించి, అంతకురెట్టింపు కుంభకమున నిల్పి, కుంభించిన వాయువును, కుడిముక్కున మెల్లమెల్లగా విడిచి, మరల కుడిముక్కున పూరించి కుంభమున నిల్పి యెడమ ముక్కున మెల్లమెల్లగా విడువవలయును. ఈరీతిని యథాశక్తి ప్రతిరోజు ఉదయమున, మధ్యాహ్నమున, సాయంకాలమున, అర్ధరాత్రియు, ఈనాలుగువేళలయందును అభ్యసించుచుండినయెడల, మూడుమాసములకు సులభముగా, కొన్ని నిమిషములకాలము ప్రాణవాయువును కుంభకము చేయవచ్చును. దీనికి మితా ఆహారమును, (సాత్వికాహారమును) భుజించవలయును దీనివలన సకలరోగములు నశించును. ఇందుకు సందియములేదు. మరియును శరీరారోగ్యమును, బుద్ధిబలమును గలుగజేయును కుంభకమును క్రమముగా వృద్ధిజేయువారికి పరమార్గముకూడ ప్రాప్తించుచున్నది. మరియు వారి పితరులు 21 తరములవారును, నరకలోకము నుండి బ్రహ్మలోకమును పొందుచున్నారు.

మరియును, ప్రతివారును మోక్షమే ప్రధానమని నమ్మి, అట్టిదానిని పొందుటకు మూలకారణంబగు ఈశ్వరధ్యానమును తప్పక జేయుచు, కేవల కుంభకము సిద్ధియగుపర్యంతమును ప్రాణాయామమును తప్పకజేయుచు, (కుంభక మనగా రేచక పూరకములను విడిచి యేశ్రమయును పొందక వాయువును తనయిష్టానుసారముగా దేహమునం దెచ్చటచ్చట నిలుపుకొనవలయునని తలచునో యచ్చటచ్చట

నిలుపుటయే కుంభకప్రాణాయామ మనబడును) ఇట్టి రేచక పూర్వక ములులేని కేవల కుంభకము సిద్ధించినయోగికి మూడులోకములయం దును కోరదగిన దేదియునుండదు అనగా, వానికన్నియును సులభమే యగును. మరియును. కుంభకాభ్యాసము గలవాడు తన యిష్టప్రకారము వాయువును నిగ్రహించుటవలన రాజయోగపదమును తప్పక పొందుచున్నాడు. దీనికి సంశయ మెంతమాత్రమును లేదు.

ఏ యోగము చేత ప్రాణవాయువు కట్టబడుచున్నదో, ఆయోగము చేతనే మనస్సును కట్టబడుచున్నది. ఎవని చేత మనస్సు కట్టబడుచున్నదో వాని చేతనే ప్రాణవాయువును కట్టబడుచున్నది కాబట్టి, మనస్సునుగాని, వాయువునుగాని, ఈరెంటియం దొకదానిని కట్టినయెడల, యారెండును కట్టబడునని తెలియవలయును.

యెట్టివారికైనను మనస్సు స్థిరపడినయెడల ప్రాణవాయువు స్థిరమగును. ఆ ప్రాణవాయువు స్థిరమైన యెడల శుక్లశోణితము స్థిరమగును. శుక్లము స్థిరమైనయెడల బలమును పిండము దేహముయొక్క స్థిరత్వమును కలుగును అందువలన మృత్యువును జయింప నగును.

ఆర్యులారా! వినుడు యిందు చేత పూర్వము గురుకులాశ్రమ మందును, బ్రహ్మచర్యమున ప్రాణాయామ మభ్యసించి కేవల కుంభకమును, స్వాధీన పరచుకొని, యిష్టదేవతానుగ్రహమునుపొంది, బ్రహ్మనిష్ఠులై సంపూర్ణతేజస్సును పొంది, కొందరు బ్రహ్మఋషులుగను, కొందరు రాజర్షులుగను, కొందరు దేవర్షులుగను, కొందరు యోగులుగను, కొందరు సిద్ధులుగను, కొందరుముక్తులుగను, కొందరు భక్తులుగను ప్రకాశించుచుండిరి.

మఱియును, కేవలము కుంభక మహిమచేతనే విశ్వామిత్రాది మహర్షులను యెన్నిపర్యాయములు తపోభంగము కలిగించినను సమర్థించుకొను నంతటి శక్తిగలిగియుండిరి కేవల కుంభక మహిమ యిట్టిదని చెప్పనలవి పడదు. కేవలకుంభకమునందు, పాండిత్యము నొందిన మహానుభావులే యిప్పటికిని ఆకాశవీధిని నక్షత్రమండలమున దివ్యజ్యోతి స్వరూపులై స్వప్రకాశులై ప్రకాశించుచుండుట మనమందరము కన్నులార గాంచుచున్నారము.

గాన, కేవల కుంభక మహిమయే పరాశక్తి. విద్యుచ్ఛక్తి. అది యే మహామాయ ఆమహామాయ ఉపాసనచేతనే బ్రహ్మకు సృష్టించు శక్తియును. విష్ణువునకు పోషించుశక్తియును, రుద్రునకు సంహార శక్తి యును కలిగియున్నది. ఇంద్రాద్యష్ట దిక్పాలురును, నవగ్రహములును, అష్టవసువులును, ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, కేవలకుంభక మహిమ చేతనే దైవత్వమును, పొందిరి కావున అట్టి ప్రాణాయామ మును అభ్యసించి, ఆకేవల కుంభకమును స్వాధీన, పరచుకొనిన యెడల క్రమక్రమముగా ఉత్తమోత్తమును పొందుదురు. ఇందుకు సంశయ మే మాత్రమును లేదు గాన

ఆర్యులారా ! యింతటి విషయములను గ్రహించి నడచుకొనిన ప్రతివారును ముక్తిచేత భక్తిని, భక్తిచేత మోక్షమును పొందుదురు గాన, తప్పక ప్రతివారును యీప్రకారము జరుపవలయునని మీ పాద ములకు నమస్కరించుచున్నాడను

## మరణ బోధ.

ఆర్య సోదర సోదరీమణులారా !

ఈలోకమున నరజన్మమెత్తినందుకు, మరల జన్మమనేది లేకుండు టకు దారి వెదుకవలయునుగాని, అట్లుగాక మరలమరల పుట్టి గిట్టేటం దులకు మార్గమైనట్టి, దొంగతనము చేతను, దుష్టకార్యాదులచేతను గలు గునట్టి పాపములకు మూలాధారమున్ను, బొంకునట్టి మాటల చేతను.

క. బొంకిన పాతకంబులగు
బొంకిన నిర్మల కీర్తి హీనమౌ
బొంకిన లక్ష్మియెడ బాయు
బొంకిన నాయు వడంగు గావునన్
బొంకుదురే మహాత్ములు నరేంద్రసేఖరా.

గావున మరు జన్మమునకు సంప్రాప్తమగునట్టి బొంకులను విడిచి, జన్మ సాఫల్యమునకు మార్గమైన న్యాయమును, నిదానము, నిజము భక్తి వీటిని అనుసరించుటకు ప్రధానము సత్యము.

సీ॥ స్థిర భక్తి తీర్థముల్ సేవించు పుణ్యంబు
సత్యవాక్యంబుతో సమము గాదు
క్షేత్రసంచారులై చెందినపుణ్యంబు
సత్యవాక్యంబుతో సమముగాదు
కాల కాలము జేయు తపముల పుణ్యంబు
సత్యవాక్యంబుతో సమముగాదు
దైవభక్తిచేత గలిగెడి పుణ్యంబు
సత్యవాక్యంబుతో సమము గాదు.

గీ. దేవతా పూజలను బూనిదైవపాద
పూజలను జేయునట్టి నతిశయ పుణ్యంబులెల్ల
సత్యవాక్యమునకు సమముగాదు, మహిని
మనుజులెల్లను సత్యంబు మరువరాదు.

గావున ఆర్యులారా ! ప్రతిమనుజలు సత్యమును తప్పక, భక్తిని తప్పక ప్రవర్తించుచుందురేని అట్టివారికి యేకష్టములురాక భగవంతుడు కాపాడు చుండును ఈసత్యమును తప్పక అనుష్టించు యెట్టివారైనను తెలిసి తెలియక జేయునట్టి పాపములను బోగొట్టుకొనుటకు ప్రతిమనుజునికి మరణానంతరములో గల్గునట్టి (నింద లేనిది బొందెపోవను) సామెత ప్రకారము శరీరమునకు యేదైన నొకవ్యాధి సంభవించుచున్నది. గాన వినుడు.

మరణావస్థనొందు కాలమున గో భూదానములను, ప్రత్తి మొదలగు దానములు జేసిన యెడల వారు స్వర్గలోకము జేరుదురు. నువ్వులు మొదలగు దానములుచేత యమధర్మరాజు మిగుల తృప్తుడగును. ఉప్పు దానము చేసినవారు యమునికి భయపడవలసినదిలేదు. ప్రత్తిదానము చేయుటచే యమధర్మరాజు యొక్కయు. వారి భటుల యొక్కయు భీతి గలుగదు దానములు దానమిచ్చుటచే యముడును దూతలును సంతసించి వారికి కావలసిన వస్తువుల నిత్తురు.

మరణసమయమున మానవుడు గోమయముచేత స్థలమును శుద్ధిపరచి, దానిపై దర్భను పరచి, వాటిపై పరుండి, నువ్వులను దర్భను చేత బూని, భగవన్నామస్మరణజేయుచు ప్రాణములు విడచెనేని బ్రహ్మరు

ద్రేంద్రాదులకుఁ గూడ నలవిగానిదియు శ్రేష్ఠమైనదియు నగు శ్రీవైకుం ఠమును జేరుచున్నారు.

మరణావస్థలోనుండు మనుజుడు బోరగిల పరుండరాదు. వెన్ను భూమిపై పెట్టి పరుండవలెను. తాను స్మృతితోనుండగానే తుఁసీదళ సహితముగా సకల దానములును తన చేతిమీదుగా జేయవలెను. ఉప్పు దానము చేయుటచే మహా ఫలముగలదు అది స్వర్గలోకమందు ఉత్పత్తి యైనదిగావున, దానిని దానమిచ్చువారు స్వర్గలోక వాసులగుదురు.

గావున యెట్టివారైనను పైనుదహరించిన దానములను జేసి మర ణకాలమందు భగవన్నామ స్మరణ జేయుచు జీవమును విడచినయెడల అట్టివారు శాశ్వత సాయుజ్యపదవిచే మోక్షమును బొందుచున్నారు గాన ప్రతివారును తప్పక వీటిని ఆచరింపవలయునని ప్రార్థించుచున్నాడను.

మరణముగలుగు సూచనలు దెలియుట

ప్రతివారును ఒక పాత్రయందు జలమును పోసి, ఆజలమునందు సూర్యబింబమును చూడగా, నది స్వచ్ఛముగా గనబడినయెడల శరీర మునకు పరిపూర్ణాయురారోగ్యము గలుగును. ఆసూర్యబింబము తూర్పుదిక్కున భిన్నముగా గనబడిన యెడల 6 నెలలకును, దక్షిణమున భిన్నముగా గనబడిన యెడల 3 నెలలకును, పడమర దిక్కున భిన్న ముగా గనబడిన యెడల ఒక మాసమునకును, నాలుగు దిక్కులయందు భిన్నముగా గనబడిన యెడల పదిరోజులలోను, పొగ కప్పినట్లు కనబ డిన యెడల 5 దినములలోను, మండునట్లు గనబడిన యెడల ఒక్కరో జులోను మరణము గలుగునని తెలియవలెను.

మఱియును ముక్కుకొనయును, నాలుక కొనయును, కనబడక యున్నను, చంద్రబింబము చౌకముగా కనబడినను 6 నెలలకు మర ణము కలుగునని గ్రహింపదగును.

అయ్యలారా! ప్రతివారును దీనిని గమనించి పైన చెప్పియుండు ప్రకారము జరుపుకొందురని మిక్కిలి ప్రార్థించుచున్నాడను.

# స్త్రీబోధ.

సోదరీమణులారా !

మీజన్మంబు యెనుబదినాలుగులక్షల జీవరాసులయందు జన్మించి తుట్టతుదకు అరటివృక్షమై పుట్టి అందులో ఫలించు ఫలములను దేవతారాధనలకును, భక్తుల యారాధనలకును, జనుల ఉపవాసరోజులయందు భుజించి తృప్తిజెందుట చేతను, ఆ వృక్షములను శుభకార్యాలంకారములకును, క్షేత్రాలంకారాదులకును ఉపయోగపరచుటచేతను, ఆకులు భాగవతుల తదీయారాధనాదులకు ఉపయోగపరచుటచేతను, ఊచను పుష్పములను శుభకార్యాదులయందును బ్రాహ్మణసంతర్పణలకు ఉపయోగపరచుటచేతను, నారను భగవతాలంకారమునకు పుష్పమాలికలు కట్టుటకు ఉపయోగపరచుటచేతను, యిట్టి సద్విషయాదుల చేయనొప్పిన అరటివృక్షజన్మము పుణ్యగతిని పొందును. పిమ్మట అంతకు తెలివిగల్గిన జన్మము అనగా ఆడకోతియైపుట్టి, దుష్కార్యములయందు మనస్సును పోనీక, హరినామస్మరణ జేయుటచేత, మరుజన్మమున మగకోతియై పుట్టి పుణ్యక్షేత్రములయందును, పర్వతశిఖరములయందును సంచరించుచు రామధ్యానము చేయుటచేత సద్గతిబొంది, యిట్టి తెలివితేటలు గల్గినట్టి స్త్రీజన్మమును పొందుచున్నారు. ముందు యెనుబదినాలుగు లక్షల జీవరాసులయందు జన్మించి, అన్నిజన్మములయందు గల్గిన పుణ్యముచేత మీకు యీస్త్రీజన్మములభించినది. భగవంతుడు యీజన్మమునందు తెలివిగలుగజేసి స్త్రీ, పురుష యను భేదములతో రెండుజీవములను కల్పించి, యందుకు పాపము, పుణ్యము, భక్తి, విరక్తి యనువాటిని నియమించి, యిందులో వారువారు జేయునట్టి పుణ్యములచేత భక్తియును, భక్తిచేత మోక్షమును పొందుచున్నారు.

ఓ సుందరీ మణులారా ! మీసౌందర్యములను జూచి, చూపు మార్చుకుడు. మీ అలంకారాదులను జూచి మీనాధుల మరువకుడు. మీసాహసములచేత సాధులను చలింపకుడు. మీవిద్యలచేత మీప్రాణవిభులను చంపకుడు. మీజన్మము నీచ జన్మమనియు, పెద్దవారిచేత "ఆడవారైపుట్టుటకన్న అడవిలో వృక్షమైపుట్టుట మేలు" అని చెప్పుట విని యుండలేదా. గాన మీరు విరక్తిచేత పాపమనునట్టి ఘోరకూపము

నందు బడకుడు. అందుచేత గలుగునట్టి కష్టములు యింతయని వ్రాయుటకు చేతులాడకున్నది. వ్రాయదలచిన యెడల ఎన్నిపుటలు నిండునో లెక్కించుటకు ఆదిశేషునకైన నలవికాదనియే నొక్కివక్కాణించవచ్చును అయితే కొన్నిటినిమాత్రము చెప్పదలచితిని. చెప్పెదను వినుడు.

ఓ సాత్వీమణులారా ! మీరు వినరానికథలను వినుటచేతను, చూడరాని నాటకప్రదర్శనములగు సినిమాలు జూచుటచేతను, జేయరాని సాహసములను జేయుటచేతను, మీబుద్ధి చలించి, అన్యపురుషుల యందు మనస్సు తగిలి, పంచభూతముల సాక్షిగా పదుగురు పెద్దలయెదుట వివాహమాడిన పురుషుని విడనాడి, నీచమైన సుఖమును ఆశించి, పర పురుషుని గూడి రమించునట్టి స్త్రీ యెల్లకాలముల యందును కష్టపడుచు, శరీరమందు బలరూపములు యున్నంతవరకు పలువుర పొందుగోరి అందుచే శరీరము నశించి ఘోరవ్యాధులకు లోనై పడరాని కష్టములను పడుచు నీస్నేహితులచేతను, నీసహోదరులచేతను, నీబంధువుల చేతను చూడబడక శరీరము పడుబాధలకు నోర్వలేక అయ్యో, యెట్టి కష్టములు సంభవించెను. మనము వివాహమాడిన పురుషుని విడనాడి నందులకుగదా యిట్టిశ్రమలు పడవలసివచ్చెను. వారిచెంత నుండిన యెడల యిట్టికష్టములును పొందక సుఖించవచ్చునే. ఒకవేళ దైవసంకల్పమువలన యేర్పడు కష్టములకు వారు చికిత్సలుచేసి మనలను కాపాడుదురు గదా యని పలువిధములం దలచి దుఃఖపోవుచు, తినుట కాహారములేక, భిక్షమెత్తుక వీథులయందు సంచరించుచు, తుదకు ఈ శరీరమును దిక్కులేని పీనుగంజేయుచున్నారు.

అట్టివన్నియు అందరు చూచుచుండియు, యీ కలియుగమందు కించిత్ సంభోగమునకై, పరపురుషుల పొందు గోరి సర్వసంపదలను విడుచుటయును గాక,

శ్లో॥ ఆత్మబుద్ధి సుఖంచైవ గురుబుద్ధి ర్విశేషతః
పరబుద్ధి ర్వినాశాయ స్త్రీబుద్ధి ప్రళయాంతకః.

అనునట్లు స్త్రీలకు అల్పబుద్ధి అని పెద్దలు చెప్పినవాక్యము అబద్ధముకానేరదు గాన ఓసాత్వీమణులారా! మీరు పతినివిడచి పరపురు

షునియందు బుద్ధిని బోనివ్వకుము. అట్టిపురుషుల జూచిన మాత్రమున మన పురుషునికి ఉండగల అవయవములేగదా ఆపురుషుని యందును గలదు. వాని యందు విచిత్రమేమి యున్నది అనియు అందుచేత గలుగునట్టి అపకీర్తిని మనస్సున తలంపుము ఈ శరీరము మలమూత్రపురీషాది దుర్గంధములచేత నిండినట్టినదియును గాక యెన్నటికి శాశ్వతముగా నేరదు. మన సంపదలు, మనవయస్సు, మనభోగములు, పురుషులు బిడ్డలు మొదలైన వారు స్థిరముగాదు ఈ లోకమును ప్రాణములను విడిచిన వెంటనే సకలమును వీడిపోవును, అయితే పుణ్యపాపములు మాత్రము విడువక వారిని పోషించుచుండును కాబట్టి యిట్టి అనిత్యములైన సుఖములయం దిచ్చవిడిచి సతులకు పతియే దైవంబని చెప్పినటుల పతిభక్తింగలిగి ప్రవర్తించవలెను.

అమ్మా వినుడు. స్త్రీలకు పురుషుడే దేవుడు. పురుషుడే బంధువు. పురుషుడే రక్షకుడు. ప్రాణముల కంటె ప్రియమైనవారు స్త్రీలకు ఈలోకమున పెనిమిటి ఒక్కడే గనుక తల్లిదండ్రి, సహోదరులు, బిడ్డలు దిక్కుగాజాలరు స్త్రీ పతిని వరించి యాతని పాదసేవ జేయుచు సదా సత్యవాక్యము, మంచిబుద్ధి, ఓర్పు, సద్గుణంబులంగలిగి వారిమాటకు బదులు మాట్లాడక వారిని సేవించుచు, పతిభక్తి గలిగిన పుణ్యస్త్రీలను తమపాతివ్రత్య మహిమను దేవతలు దేవలోకమునందు కొనియాడుచుందురు గాన.

ఓభక్తశిఖామణులారా! పూర్వము మహాపతివ్రత లనబడిన, అనసూయదేవి పతిభక్తిచేత త్రిమూర్తులను బిడ్డలుగా జేసెను. యినుమును సెనగలుజేసి యిచ్చెను. సావిత్రిదేవి పతిభక్తిచేత తనభర్త ప్రాణమును, సకల ఐశ్వర్యములను బొందెను. అరుంధతీదేవి పతిభక్తిచేతగదా నక్షత్రమండలమున వెలుగుచున్నది. యింకను యెందరో పతివ్రతలు పతిభక్తిచేత కీర్తి వహించిరని మనపురాణములలో జెప్పబడి యున్నది. పతిభక్తికి మించినభక్తి లేదు. యెట్టి చింతలు మనస్సున దలపక సర్వకార్యములయందును సత్యమును వదలక, పతికంటె వేరుదైవము లేదని, పతిని దైవముగా భావించి, మిక్కిలి భక్తిగలిగి, పతియొక్క మనస్సునకు యేలాటి కష్టములను గలుగ నీయక, సర్వము వారేయని నమ్మి, అత్తమామలయందును భక్తిప్రేమలు గలిగి ఈ నాటకమందు దెల్పియుండు

విధమున పతికి ఉపచరించుచున్న ప్రతిస్త్రీయున్ను యిహమునందు కీర్తి యును, పరమునందు మోక్షమును బొందుదురు. గాన ప్రతిస్త్రీయును తప్పక వీటిని అనుసరించి లోకమున కీర్తి బడయుదురుగని మీా పాదార విందములకు నమస్కరింపుచున్నాడను.

---

# పురుష బోధ.

ఆర్యులారా !

ఈ జన్మము యెనుబదినాలుగులక్షల జీవరాసుల యందు జన్మించి తుదకు యీ మానవజన్మ మెత్తినపుడు తల్లిగర్భమునుండి, జీవుడు తన పూర్వజన్మకర్మాదులను జ్ఞప్తికి దెచ్చుకొని నేను ముందు యెన్నిజన్మము లెత్తితినో యింక యెన్నిజన్మము లెత్తవలయునో యని దుఃఖించుచు, సర్వేశ్వరా, నేను తల్లిగర్భమునుండి వెలువడిన వెంటనే మిమ్ముల భజించెద. ఇంక నేనెంతమాత్రము పాపకార్యములను జేయను. ముందు నేజేసినపాపములను నే నొక్కడనే యనుభవింప దగినవాడనై తిని. అందలి లాభములనుమాత్రము అనుభవించినవారు వేరు అయిరి. ఇంక నేను యెట్టికర్మములను జేయక, మిమ్ములనే ధ్యానించి దృఢముగా మనస్సు నిల్పెదను అని యనేక ప్రమాణములు జేయుచు, హే పరమే శ్వరా! హేదీనబంధో! నా కామాగ్ని, కోపాగ్ని, జఠరాగ్ని యను అగ్ని త్రయముచేత నిరంతరము మిక్కిలి వేగముగా కాగుచున్న యీ మల మూత్ర రక్తములతో నిండిన దుర్గంధమైన యీ గర్భగోళముకంటె ఘోరమైన నరక మెక్కడయున్నది దేవా, నన్నీదుర్గంధమునుండి తొలగింపుడు. నేనింక యిట్టిపాపములను యెన్నటికిని జేయను. అని పరిపరి విధముల సంకటపడుచు గర్భమునుండి తలక్రిందుగా వెలుపలికి వచ్చును. వెలుబడినవెంటనే విష్ణుమాయకు లోబడి పూర్వజ్ఞానమును మరచి పర లోక సాధన మేమియు జేయక యీ కలియందు సంసారమను ఘోర కూపమందు జిక్కి, ఇండ్లు వాకిళ్లు బంధు మిత్రపుత్ర కళత్రములు అను ముండ్లకంపలో జిక్కి, యీ జన్మమే సార్థకమని నమ్మి ఘోరమైన కామాంధకారములచే జిక్కి పరమాత్ముని మరచినట్టి మాత్రమున నీజీవితకాలము తగ్గినది. నీతెలివితేటలు మాయమైనవి. ధైర్యము నశించి

నది అయ్యో ఈస్థితి యెంత భయంకరముగా నున్నదో, దీనింగూర్చి క్షణకాలమైనను యోచించితివా? దోచుకొనిపోవుయముదెవడో గ్రహించితివా ? కల్పవృక్షమును బూడిద జేసిన పిడుగుయొక్క ప్రమాణ మింతయని కన్ను దెలియక సుఖమును ఆశించి సదాతొలగించుటకు వీలుబడని యీయజ్ఞానమున మునిగియున్నారు. వారియజ్ఞానము వదలుటకు తగిన యవకాశములను వృధాగా పోగొట్టుచున్నారు. ఏలనన యీకాలపువారు పురాతన మార్గ మూఢభక్తిచేతను, సుఖానుభవమును గురించి అజ్ఞానము చేతను, విపత్తు లిట్టివని తెలియక యీ మానుష జన్మ మెత్తినందుకు సాఫల్యముగా నిశ్చయమైన సుఖమును పొందు మార్గమును తెలియక జీవితకాల మంతటిని జెరిపెడి యల్పసుఖమును నమ్మి యీ జన్మము చింతపండుకొరడు వదలిపడినట్లు యీజీవుడు తల్లి గర్భమునుండి క్రిందపడి పండునుమాత్రము తిని విత్తును పారవేసినటుల జీవుడు ఈ శరీరమును వదలిపోవుట సహజమై యున్నదిగదా. కుమ్మరపురుగు బురదలో సంచరించి దేహమునకు కొంచెము మలినమైనను అంటక ఎట్లు బయటికివచ్చునో అటువలె మానవశరీరమును పొందిన ప్రతిజీవుడును సంసారమునకు లోబడినప్పటికిని, అట్టి సంసారమును తొలగించుటకు మార్గమును వెదకి, ఆసంసారమున అంటియంటక ఉండవలయును. అట్టిసూక్ష్మమును మరచి చదువరాని పుస్తకములను చదువుట చేతను, వినరాని సంభాషణలను వినుటచేతను, పశుపక్ష్యాదులు భోగించునది చూచుటచేతను, యిట్టి చెడుయలవాటులయందు మనస్సును నిల్పి, మరల వాటినుండి మనస్సును త్రిప్పుకొనుటకు శక్తిలేక, అన్యస్త్రీల సహవాసమునుగోరి వారిరూపలావణ్యాదుల బొగడుచు, రక్త మాంసాదులచే పెరిగిన వారి స్తనములను జూచినమాత్రమున, జ్ఞానమనునది మరచి కించిన్మాత్రమున గలుగు యజ్ఞానమున మునిగి వెలిగెడి యగ్ని సమీపమందలి వెన్నవలె, దుర్గంధమైన నరకకూపములోబడి, అన్యస్త్రీపాతకములకు లోనై, దుష్టుడను పేరువహించి, యీ శరీరము దుర్గంధమైన వ్యాధులచే కష్టపడుచు, ఘోరమైన స్థితిలో బొదలుచున్నారే. అయ్యో, అట్టిమార్గములలో మనస్సునిడక అన్యస్త్రీనిచూచిన మాత్రమున తల్లివలె భావించుకొని ప్రతివారికి సర్వేశ్వరునిచే సంకల్పింపబడిన సతిని (భార్యను) మనకు నియమించియుండగ, యిట్టిస్త్రీలను

కోరనేల. వారికియుండు అవయవములున్ను మన భార్యయందుండ మన మేల పరులను కోరవలెనని తలచి, అట్టి దురభ్యాసములను వదలి, కామ క్రోధలోభమోహ మదమాత్సర్యములను విడచి ధనధాన్యసంపదలను జూచి గర్వింపక.

సీ. సకల ధనధాన్య సంపదలను విడచి
 బంధు జనంబుల బాసి నీవు
తల్లిదండ్రి భార్య బిడ్డలెల్లను విడచి
 తనువు పోవునపుడు తలచి తలచి
వీరినెల్లను యెట్లు విడిచి పోదును యంచు
 తల్లడిల్లుచు ప్రాణ తమకమొంది
యెల్లవారు నీచుట్టు యేడ్చు చుండగ జూచి
 రాముని మదిలోన దలుపలేక

గీ యమునిచే జిక్కి జీవంబు హింసజెంది
నపుడు శ్రీరామ నన్నేలుమంచు మీరు
దలచునట్టి బుద్ధుల ధాత్రిలోన
దలచరై తెరి యికనైన బుద్ధి దెలిసి
హరినిధ్యానింపు చుండుము యవని లోన.

అయ్యలారా ! వినుడు. మనకు గలుగు క్షణకాల సుఖమును దలచి సంతోషపడకు క్షణకాలదుఃఖమును జూచి కష్టపడకు సుఖదుఃఖ ములకు లోబడక సదా నిశ్చలచిత్తముతో శ్రీహరిని ధ్యానించుచు "సర్వం విష్ణుమయం" అను నీతివాక్యమును మనస్సున దలచి, నీవు యెల్ల ప్పుడును ఓర్పుగల్గి, మాటతప్పక, యితరుల సొమ్ముపహరింపక, ఒరుల హింసింపక, శాంతమును వహించి, మనోవికారముజెందక, దొంగతనము, పరస్త్రీ సహవాసము మొదలగు పాపకృత్యములను జేయక, యెల్లప్పుడు సత్పురుషుల సహవాసము జేయుచు పరులకు ఉపకారములను జేయుచు అన్యభూతములను తనవలెనే భావించి, నిశ్చలచిత్తముతో మృత్యు దేవత వాత బడక, తప్పించుకొను మార్గమునకై, ఓ భగవంతుడా, నాజన్మము నీటిలో విసరినరాయివలె, ఘోరసంసార సముద్రమునందు మునిగిపోతున్నానే, ఓదేవా. నాజన్మము తిరుగటిలో బోసిన గోధుమలు

వలె, యీసంసార చక్రమునందు చూర్ణమగుచున్నదే, అయ్యో, ఈ సంసారమను అడవిలోనున్నవానిని యముడనెడి పెద్దవ్యాఘ్రము అకస్మాత్తుగాగొనిపోవుచున్నాడే. దేవా, యీదినము ఒక శరీరమును మోసుకొని తిరిగెడి ఈ జీవుడు మరుదినము మరియొక్క దేహమును భరింపవలసిన యోగము తటస్థించుచున్నదే యని మానవులకు మృత్యువు యెల్లప్పుడును వెంటనంటి వచ్చుచున్న దనువిషయము జ్ఞాపకమునందుంచుకొని వెనుక యెప్పుడో సాధించవచ్చునని యుపేక్షసేయక యీ నాటకమందలి నీతివాక్యములను బుద్ధిబలముచేత గ్రహించి దేహబలము గలిగియున్నప్పుడే మోక్షసాధనమునకు ప్రయత్నించవలెనని మిమ్ముల మిక్కిలి ప్రార్థించుచున్నాడను.

# కు టుం బ బో ధ.

ఆర్యులారా !

ఈలోకమందు ఒక తలిదండ్రులకు నలుగురు పుత్రులు జనించిరేని వారిలో ఒకడు శాంతపరుడుగాను, ఒకడు దుష్టబుద్ధి గలవాడుగాను, ఒకడు భక్తిపరుడుగాను, మరియొకడు మంచిబుద్ధిమంతుడుగాను వుందురు. వారొకరొకరు సంబంధములేక ప్రవర్తించుటచేత కుటుంబములో కలహములు యేర్పడి వీడిపోవుచున్నారు యిందులో వారివారికి ప్రాప్తిసిద్ధించునని తలచక నా సామర్థ్యముచేతనే కుటుంబము వృద్ధిపొందుచున్నదని పలుమారు వక్కాణించుచుందురు. వారికేల మంచి నీతులు దెలియక పోయెను యిట్లు ప్రవర్తించుటచేత, తక్కిన సోదరులు యిట్టి మాటలను వినజాలక కలహప్రియులై ఒకరికొకరు కొట్టుకొని కటుంబమును చీల్చుకొని వారువారు వేరు పడుదురు. అందు అదృష్టమున్నవాడు సుఖముగా నుండును. తక్కినవారలు దరిద్రదేవత వాతబడి పలువిధముల కష్టపడుచున్నారు గావున యిది యెరుంగని మూఢాత్ములకు పలువు రెన్ని దెల్పినను వినక మిక్కిలి శ్రమలకు లోనగుచున్నారు. యిది యెల్లరను జూచుచుండు విషయమేగదా

ఆర్యులారా ! వినుడు. కుటుంబములోనివారందరు యేకీభవించి యుండిరేని అందులో ఒకరి యదృష్టము పూర్తియగునప్పటికి

కురియొకరి వశ చేత కుటుంబపోషణము జరుగు చుండును. అందుచే కుటుం
బవృద్ధియును కీర్తియును వహించుచున్నది. యెల్లరు చూచుచున్న విష
యమే అట్టివారిని మనము చూచినపుడు మనమనస్సు చింతిల్లుచున్నది.
భగవంతుడిచ్చిన బుద్ధి బలము చేత సుఖించుటకు శక్తిలేక ఒకరి యోర్పును
కీర్తిని చూచి వగచినంతలో రాగల లాభ మేమిగలదు. తానును ఓర్పును
ధరించి దుష్కృత్యములైన మాటలను నుడువక, నీచకార్యములను
జేయక, శాంతము వహించుచుండు రేని.

ఆ. అల్పుడెపుడుబల్కు నాడంబరముగాను, సజ్జనుండుబల్కు చల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా, విశ్వదాభిరామ వినురవేమ.

యనునట్లు అల్పుడనగా కంచు ఎంత శబ్దముగా మ్రోగినను బంగా
రునకు గల విలువ కంచునకు రాజాలదు గదా! అట్లే దుష్టుడెంత గంభీ
రముగా మాట్లాడినను వాని మాటలు నమ్మజాలరు ఓర్పుగల వారిని
యెల్లరును పొగడు చుందురు. అట్లు పొగడబడువారు గర్వమును వహిం
చక పైకి ఓర్పుతోనటించుచు.

ఆ. ఆత్మశుద్ధిలేని యాచారమదియేల, బాండ శుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలయ, విశ్వదాభిరామ వినురవేమ.

యనునట్లు మనస్సున కపటముపుంచి నటించితి రేని, యందుచేత
పాపములు గలుగు చున్నది. యెల్లవారును మనస్సునందు యే కపటము
నుంచక నిర్మలమైన బుద్ధితో ప్రవర్తించుచు కుటుంబములో గల యెల్ల
వారి బుద్ధులను గ్రహించి వారివారి కెట్లు నటించవలెనో, యట్లు నటిం
చుచు, దుష్టబుద్ధిగలవారితో మన శాంతబుద్ధిని జూపుచు, అట్టివారితో
విశేషముగా మాట్లాడక, వారి వారి పనులను వారువారు చూచుకొను
చుందురేని, అట్టివారిని చూచినవారు భయపడ గలరు. కుటుంబము
యందును, యెట్టి కలహములు పుండినను కలహించ గలవారికి తగినబుద్ధి
చెప్పి వారిని ఓదార్చి కుటుంబమును పోషించుచుండవలెను. అట్టివారె
పోషణకర్త లగుదురు. యిందుచేత సుఖమును, చూచువారికి గొప్పగా
కనబడుచున్నది. గాన యెల్లరును బహుసూక్ష్మముతోను యితరులకు
ఋణబాధలేక ప్రవర్తించవలెను.

సీ. ఋణశేషమున్నను రిపుశేషమున్నను
వహ్నిశేషమున్న వచ్చుగీడు

భుక్తివధూ జన రక్తి నిద్రాసక్తి
యగ్గలంబైన గీడాపహిల్లు
గుత్సితాత్ముని తోడు గోపన జనముతో
గొండ్లోక వారితో గోష్టిదగదు
ఆర్భక పశుముది దాంగ రక్షలయందు
నేమరు పాటొంద నెగ్గు జెందు

గీ. ఇట్టినయమూర్గ మెఱుగక యిచ్ఛవచ్చి
నట్లు చరియించువారికి హానివచ్చు
మదనపురిపాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్తసంత్రాణ శీల.

అనునట్లు ఋణముచేతను, స్త్రీ. స్నేహముచేతను, దుష్టసహవాసము చేతను, అమిత నిద్రచేతను, యిచ్ఛవచ్చినట్లు చరించుటచేతను, అమిత కష్టములు గలుగుచున్నదిగాన, మీరు.

సీ. ధర్మమార్జించుట దాక్షిణ్య పరుడౌట
సత్యవ్రతుండౌట సరసుడౌట
నిష్కర్మ పరుడౌట నిందబొందక యుంట
తనయుల బడయుట ధన్యుడగుట
పరహిత కరుడౌట పాడియుగల్గుట
ముక్కంటి గొల్చుట ముక్తిగనుట
సంపద గల్గుట సాధుల బ్రోచుట
సుజ్ఞాననిధియౌట సుముఖుడౌట

గీ ఇట్లు విహరించు మానవు లిహము పరము
గలిగి వెలయుదు రెందు కరుణవలన
ప్రణుత దవళాంగ మౌని హృత్పద్మభృంగ
అహిత మద భంగ శ్రీకాళహస్తి లింగ.

అనునట్లు ధర్మాధర్మములను గ్రహించి ప్రవర్తించుచుందురేని ఇహమునందు కీర్తియును, పరమునందు మోక్షమును బొందుచున్నారు. గాన యీవిధంబున నడచుకొనుచు, యీక్రింది విధంబున కుటుంబము నందు నడచుచుందురేని యేకష్టములు చేకూరదు.

## కుటుంబ ఆరోగ్యబోధ.

1. కిరసనాయిల్ (మట్టినూనె) వేరుసెనగనూనె దీనిని వదలవలెను. నువ్వులనూనె రాత్రింబగలు యెడతెగక దీపము వెలుగుచుండెనేని గృహంబున లక్ష్మి నివశించును.

2 సరివికట్టెలు వాడకూడదు.

3. వడ్లుదంచిన బియ్యము, వెన్న కాచిన నెయ్యి, వాడుకొనవలయును.

4. ప్రతివారును ఉదయం దమ్మిడీయెత్తు అల్లం, మధ్యాహ్నము దమ్మిడీ యెత్తు సొంటి, రాత్రి దమ్మిడీ యెత్తు కరక్కాయతోలు తినుచుందురేని దేహమునందు యెటువంటివ్యాధియును జేరక సుఖింతురు

5. మట్టిపాత్రలతోనె వంటచేయవలెను.

6. వంటచేయు పాత్రలను శుభ్రముగా తోముకొని వంటచేయవలెను. కాని దానియందు యేమాత్రమును అంటు (మసి)వుండగూడదు. మసివుండిన పాత్రలో అన్నముచేసి భుజించిరేని బుద్ధి మాలిన్యము గలుగును.

7. శిరస్నానము జేసి శ్రీచూర్ణముగాని, విభూతిగాని ధరించి, ఈశ్వరధ్యానమును జేసుకొని వంటజేయవలయును. వంటజేయునపుడు వారిమనస్సు నిర్మలమై ఈశ్వరభక్తి గలిగియుండవలెను.

8. ప్రతివేళయందును ఉతికి ఆరవేసిన వస్త్రములను ధరించవలెను.

9. పాదరక్షలు గొడుగు ధరించక బాటయందు యెక్కువగా నడువకూడదు.

10. ప్రతి శని బుధవారమైనను వంటజేసిన ఆముదముగాని, చిట్టాముదముగాని, నువ్వులనూనెగాని, నెయ్యినిగాని, తలయంటుకొని స్నానము జేయుచుండవలెను

11. రైలుబండ్లమీదగాని, మోటారుబండ్లమీదగాని, యెక్కువగా ప్రయాణము చేయగూడదు.

12. యెప్పుడును మురికినీళ్లను త్రాగకూడదు ఇండ్లయందు చెడ్డవాసన యుండకూడదు.

13 యెప్పుడును మితముగా సంభోగము చేయవలెను. సంభోగా

త్పూర్వ్వముగాని, సంభోగానంతరముగాని వేఁడిపాలును పుచ్చుకొనుచుండిన యెడల దేహమునకు బలము గలుగుచున్నది.

14 సంభోగకాలమునందు స్త్రీ పురుషాదులు భగవంతుని ధ్యానించుచుందురేని అట్టివారికి గలుగు సంతానము మిక్కిలి బుద్ధివిశాలమును, మాతృ పితృ గురు దైవభక్తి గలిగియుందురు.

15. యెప్పుడును మితముగానె పనిచేయవలెను. మితముగానె మాట్లాడవలెను మితముగానె భుజించవలెను.

16. యెప్పుడును పచ్చికూరలను భుజింపకూడదు. చక్కగా వుడికిన కూరలనే భుజించవలెను.

17 ప్రతికూరయందు మంచి నిమ్మపండ్ల రసమును వాడుచుండవలెను. నిమ్మరసము యొక్క చారుతోనె భోజనము చేయవలెను.

18 భోజనమునందు అల్లము పచ్చడిని వాడుచుండవలెను. మంచి ఇంగువను తాలింపు చేయుచుండవలెను.

19. పచ్చిపెసలును,పగులగొట్టిన పెసలపప్పును వాడుచుండవలెను.

20. రాత్రిపూట గోధుమరొట్టెలను, పండ్లనుగాని తినుచుండవలెను. ఆవుపాలునుగాని వేడినీరునుగాని త్రాగవలెను.

21. ఆరుమాసముల కొకతూరి ఇంటికి సున్నము కొట్టవలెను.

22. ప్రతిరోజు గోమయముచే యింటిని అలుకుచుండవలెను.

23. ప్రతియింటియందును దేవతార్చనలు, దీపారాధనలు జరుపుచుండవలెను.

24 ప్రతిఏకాదశియందు ఉపవాసముండవలెను.

25. భోజనకాలమునందు పరమేశ్వర, శివ, శంకర, నారాయణ, గోవింద, వాసుదేవ అని మనస్సులోనె ఒక్కొక్కముద్దకు ఒక్కొక్కధ్యానము జేయుచు, భగవంతునికి అర్పణముజేసి భుజించవలెను.

26. ఇతరులకు ధనముగాని, పుస్తకముగాని, అన్నముగాని, మరియేవస్తువుగాని యిచ్చునపుడు శివార్పణ మనిగాని శ్రీకృష్ణార్పణ మనిగాని మనస్సులోనె తలచుచు ఆవస్తువును యివ్వవలయును.

27. జర్మన్ సిల్వరు (వెండి) పాత్రలయందు, కషాయములు పుచ్చుకొనగూడదు. అన్నము, కూరలు, మొదలగునవి అందులో వంటచేయగూడదు.

28. సబ్బుబిళ్లలను దేహమునకు వాడరాదు.

29. పదునైదుదినములకు లేక నెలదినముల కొకసారి యైనను విరేచన ఔషధమును వాడుచుండవలెను.

30 జ్వరము, అజీర్ణము, పైత్యపుడుకులకు, ఐదుదినములు లేక తొమ్మిది దినములకు కషాయము వాడవలెను.

31. సూర్యోదయాత్పూర్వము ప్రతిదినము స్నానముజేయుచుండవలెను.

32. కురుపులకును, మేహరణములకును, ఆముదముగాని, బంకమట్టిగాని, పట్టు వేయవలెను.

33 భోజనకాలమందు మంచినీరు యెక్కువగా పుచ్చుకొనుచుండిన అన్నము చక్కగా జీర్ణమగుచుండును.

34. రాత్రి పరుండబోవునపుడు వేడిపాలు లేక వేడినీరును పుచ్చుకొనిన మలబద్ధకము పోవును.

35 భోజనము చేయునపుడు తూర్పుముఖముగా కూర్చొని భుజించిన కుటుంబవృద్ధియును, పడమర ముఖముగా కూర్చొని భుజించిన ధనవృద్ధియును గలుగును

36 తాంబూలము వేయునపుడు ఆకు ముందు వేసి వెనుక వక్క వేసికొనినయెడల శుభము గలుగును.

37. భుజించునపుడు దేహముపై వస్త్రము వేసుకొని భుజింపవలెను.

38 పరుండునపుడు తూర్పు తలవుంచి పరుండిన సకలభాగ్యములు గలుగును. పడమరతలయుంచి పరుండిన సుఖము గలుగును. ఉత్తర దక్షిణముల యందు తలయుంచి పరుండరాదు.

ఆర్యులారా!

యిందులోగల సకలవిషయములను శ్రద్ధగా పరిశీలించి యీప్రకారము నడచుకొనుచుందురేని, యిహమునందు సుఖమును, పరమునందు మోక్షమును పొందుదురు గాన ప్రతివారు యిందలి విషయములను మరువక నడుచుకొనుచుండవలె ననియు, యిందుగల లోపాలోపములను సవరించుకొనవలయు ననియు మిమ్ముల ప్రార్థించుచున్నవాడను.

# శ రీ ర బో ధ.

శరీరపోషణార్థమై ఒక కథ.

ఆర్యులారా !

హిందిపట్టణ మను రాజ్యంబున ఒకరాజుండెను అతనికి ముగ్గురు కుమారులుగలరు. వారు అతినీతితో రాజ్యమేలు చుండిరి. ఆ రాజ్యంబున బీదబ్రాహ్మణు డొకడుండెను. వానికి ఏడుగురు బిడ్డలు యుండిరి. బ్రాహ్మణు డాబిడ్డలను పోషించుటకు శక్తిలేక మహారాజువద్దకు వెళ్లి తనకష్టములను దెల్పినయెడల వా రేదేని సహాయము చేయుదురు. ఆ సొమ్ముతో బిడ్డలను పోషించవచ్చునని తలంచినవాడై యావిషయమును తనభార్యకు దెల్పెను. యందుల కామె భర్తనుజూచి నాథా! మీరు రాజుగారిని సేవించుటకై రిక్తచేతులతో పోరాదు. గాన ఏదేని ఒకవస్తువును గొనిపోయి మర్యాదచేసి తమ కష్టసుఖములను దెల్పితిరేని వారు సంతోషించి బహూకరింతురు. అందుచే మనము జీవించవచ్చును. రాజులను జూడబోయినను, స్నేహితులను జూడబోయినను, దేవాలయమున కేగినను రిక్తచేతులతో పోరాదని పెద్దలు చెప్పుదురు గాన మీరు వూరక వెళ్లరాదు. అనిన,

బ్రాహ్మణుడు భార్యమాటలను విన్నవాడై మహారాజులకు మర్యాద చేయగల శక్తి తనకేడ నున్నది అని యోచించి, సరి రాజులకు శరీరమును పోషించుట యందు అధిక ప్రేమ గలదు. గాన అందుకు తగిన పద్ధతులను వ్రాసి రాజుగారి కిచ్చిన యెడల వారు మెచ్చి మనకు బహుమతి యివ్వగలరు యని తలంచి, కాగిత మొకదానిని తీసికొని అం దిట్లు వ్రాసెను.

1. తలిదండ్రుల యాజ్ఞ మీరకుము.
2. సూక్ష్మముతో బ్రతుకవలెను.
3. భుజించునపుడు ముందు కాకికి పెట్టి వెనుక భుజించుము.
4. శయనించునపుడు పడక తట్టిచూచి పరుండుము.
5. దూరప్రయాణం జాగ్రత.
6. ముందుకోపం నివర్తించుము.
7. పెద్దలను దూరకుము.
8. శత్రువుల వధింపుము.

ఆర్యులారా! వినుడు. ఈ బ్రాహ్మణుడు యీ ఎనిమిది వాక్యములు గల కాగితముపు చేకొని, తన చేతనున్న రెండురూకలకు పుష్ప తాంబూలాదులంగొని, రాజనగరున కేగి ద్వారపాలురజూచి వినయముగా అయ్యలారా, నేను రాజుగారి సేవకై వచ్చినాడనుగాన నారాకను రాజుగారికి తెల్పుడనెను. సేవకులట్లే బ్రాహ్మణున రాకను రాజుగారి కెరింగించిరి. వెంటనే రాజు ఆబ్రాహ్మణుని తన కొలువుకూటమునకు దీసుకరమ్మని ఆజ్ఞయొసంగెను. ఆమాటను విన్న సేవకులు బీదబ్రాహ్మణుని వెంటబెట్టుకొని కొలువుకూటంబునకేగ, అందు రాజుగారును, వారిపుత్రులిపువురును, కొలువు తీరియుండుటంజూచి, బ్రాహ్మణుడు భయభక్తులతో దండప్రణామంబొనర్చి, రాజుగారి చెంతకేగి, కొనివచ్చిన పూలహారమును మెడయం దలంకరించి, ఆశీర్వాదు లొనర్చి. కాగితమును తాంబూలముదుంచి రాజుగారి చేతికిచ్చి, రెండు కరంబులం జోడించి నమస్కారంబొనర్చి, తనకు కలిగిన కష్టసుఖంబులను దెల్పి నిలచెను.

అంతట రాజుగారు కాగితమును విప్పిచూచిన తత్క్షణము రౌద్రాకారుడై, బ్రాహ్మణుని జూచి, ఓరీ, మూఢాత్మా! నావంటి రాజున కిట్టి నీతులం దెల్ప యెంత సాహసించితివి, అని యీ కాగితమును బ్రాహ్మణుని ముందు విసరివైచి, ఓరీ, నీవు బ్రాహ్మణుడవని మన్నించి వూరకుంటిని. లేనిచో నిన్నెంతపని జేసియుందునని పుత్రులవైపుజూచి యీ బ్రాహ్మణుని బయట నెట్టించుడని యాజ్ఞాపించెను. వారు సేవకులం బిలచి, ఈ బ్రాహ్మణుని దీసుకపోయి నగరివెలుపల వదలుడని నుడివిరి. వెంటనే సేవకులు భయభ్రాంత యుక్తులచే గడగడ వణకుచున్న బ్రాహ్మణుని తోడిదెచ్చి నగరివెలుపల వదలిచనిరి. అంతట బ్రాహ్మణుడు రాజుగారిచే పరిభవించబడి యేడ్చుచు తనయింటికై మరలెను. ఇంతలో రాజుగారి కనిష్టపుత్రుడు యెచ్చట నుంచియో తనగుఱ్ఱముపై వచ్చుచు యీ బీదబ్రాహ్మణుని జూచి, దయార్ద్ర హృదయుడై గుఱ్ఱముదిగి బ్రాహ్మణునిజూచి అయ్యా బ్రాహ్మణోత్తమా! మీరేల యిట్లు దుఃఖంచుచు పోవుచున్నారని యడుగ, బ్రాహ్మణుడు జరిగిన విషయముల నన్నిటిని వారికిదెల్ప, వెంటనే వారిమనస్సు కలతజెంది, బ్రాహ్మణుని తన వెంట దోడ్కొని, బొక్కసదారుని వద్దకేగి, బ్రాహ్మణునికి వెయ్యివరహాలిచ్చి సంతోషపరచి, కాగితమును తీసుకొని పొమ్మని సెలవిచ్చెను.

బ్రాహ్మణుడు చాలా సంతసించినవాడై రాజపుత్రునిజూచి నాయనా, నీవు యీ కాగితమునందు లిఖించియుండు యీనిమిది వాక్యములను జ్ఞప్తియందుంచుకొని, రాజ్యపరిపాలనం బొనర్చితివేని, నీకేకష్టములును గలుగదని యాశీర్వదించి, రాజపుత్రునివద్ద సెలవు పుచ్చుకొని యింటికి వెడలి పోయెను.

నాటిసాయంకాలము, బొక్కసదారుడు రాజుగారికి లెక్కలు జూపగా, అందులో తన కడపటికుమారునిపేర వెయ్యివరహాలు వ్రాసి యుండ జూచి, అవి యేమని యడుగ, ఆతనెవరో ఒక బ్రాహ్మణుని తీసుకవచ్చి వానికి యిచ్చి పంపెనని బొక్కసదారుడు తెల్పెను. అంతట రాజు తాను పరిభవించిన బ్రాహ్మణునికే ఈవరహాలిచ్చి యుండునని తన మనంబున వూహించి పుత్రుని పిలిపించి, నీవు రాజ్యంబునకు తగిన వాడవు కావు. గాన రేపటిదినం తెల్లవారునప్పటికి ఈరాజ్యమువిడచి బయటికి వెళ్లవలెనని కఠినయాజ్ఞ నొసంగెను.

1. తలిదండ్రియాజ్ఞ మీరకుము.

అంతట రాజపుత్రుడు తనభార్య పూర్ణగర్భిణిగా యుండుట తండ్రి యెరిగియు తన కిట్టియాజ్ఞ నొసంగెనని కోపోద్దీపితుడై బ్రాహ్మ ణునివలనగదా మన కిట్టికష్టము సంభవించెనని దుఃఖించి బ్రాహ్మణుం డిచ్చిన కాగితమును చింపివేయ దొడంగినను, ఒకమారు విప్పిచూడ మనంబు గలవాడై చూడ అందు 1 తలిదండ్రియాజ్ఞ మీరకుము అని యుండినది చూచిన క్షణంబున తన మనస్సును శాంతపరచుకొని, తనబుద్ధి లేనితనమునకు వగచి, తనయంతఃపురమున కేగి, తనకు సంభవించినవా టిని వెలుపర్చక, సేవకుని బిలచి ప్రయాణమునకు కావలసిన సామగ్రుల ను సేకరించి గుఱ్ఱమును సిద్ధపరచుమని సెలవిచ్చెను.

పిమ్మట తనభార్య యున్న అంతఃపురమున కేగి వాడుకమేరకు సతితోటి భోజనాదులం దీర్చుకొని, శయ్యాగృహంబున కేగి అందు కొం తసేపు సరససల్లాపములందేలి, నిద్రించినట్లు నటించి, భార్య నిద్రించినది జూచి ఆ యర్ధరాత్రికాలమున కాగిత మొకదానిని తీసి అందు ప్రియా! నేను తండ్రియాజ్ఞను మీరలేక దేశాంతరముల కేగుచున్నాడను. నేను వచ్చువరకు నీవేమాత్రము దుఃఖించవలదు. నేను శీఘ్రములో రాగ లను. అని వ్రాసి భార్యప్రక్కన వుంచి, భార్యను విడచిపోవుటకు మన

కు రాక, తండ్రియాజ్ఞను జవదాటుటకు మనస్సొప్పక, మేడదిగి తనయాజ్ఞ ప్రకారము సేవకుడు తయారించియున్న గుఱ్ఱమెక్కి ప్రయాణమాయెను. అట్లుపోవుచు రాత్రియంతయు నిద్రలేక అడవులు, నదులు, గుట్టలు దాటి మరుదినము మధ్యాహ్న వేళకు ఒకసుందరమగు పట్టణమును జేరెను. అంతట ఆయాకటివేళ మించినందునను, బాలుడైనందునను ఆకటికి తాళలేక పూటకూళ్లయింటిని విచారించుకొని వెళ్లి పూటకూళ్ల పెద్దమ్మను జూచి అమ్మా ఒకపూట భోజనమునకు యేమి అడిగెదవని యడిగెను. అందుకు పెద్దమ్మ రాకుమారుని జూచి పూటకు ఒక్కవరహా యివ్వవలెనని చెప్పెను. వెంటనే అడిగిన డబ్బిచ్చి స్నానసంధ్యావందనాదులం దీర్చుకొని, భుజించి తాంబూలము వేసికొనుచు, పెద్దమ్మను జూచి, అమ్మా యీపురంబున గల విశేషములెవ్వి అని యడిగెను.

పెద్దమ్మ బాలుని జూచి నాయనా, ఈపురంబేలు రాజునకు సుందరి యను పుత్రియొకటి గలదు. ఆమె యొకప్రతిజ్ఞ పట్టియున్నది. ఆప్రతిజ్ఞను యెవ్వరు తీర్చెదరో వారిని వివాహమాడెదనని పట్టుపట్టియున్నది. ఆ ప్రతిజ్ఞనుతీర్చుటకై యెందరో రాజులు, విద్వాంసులు, ధనవంతులు వచ్చి తీర్చలేక దానికి బానిసలై యున్నవారని తెల్పెను. ఇదియే ఈపురంబున గల విశేషము. మరేమియును లేదు అనెను. రాజపుత్రుడు యీ మాటలను విన్నవాడై పెద్దమ్మనుజూచి అమ్మా నేనున్నుపోయి యావిషయమునుచూచివచ్చెదను నీవు రాత్రికిభోజనముతయారుచేసి వుంచుము. రాత్రికి నేను యిందే శయనించి, ఉదయమున లేచిపోయెదనని జెప్పెను. పెద్దమ్మ బాలుని జూచి నాయనా, రాజాధిరాజులవల్ల కానేరని పని నీవలన కాబోవునదేమి. అందున నీవు పసిబాలుడవు యేల దాని చర యందు బడెదవని జెప్పెను. రాజపుత్రుడు పెద్దమ్మమాటలను వినని వాడై గుఱ్ఱమునెక్కి రాజవీధిని బోవుచుండెను.

ఆరాజపుత్రియగు సుందరి తన జవరాండ్లతో అంతఃపుర మేడపై నుంచి, గుఱ్ఱముపైపోవు రాజపుత్రుని ముఖవిలాసమును జూచి, చెలికత్తెనుపంపి యారాజపుత్రుని తనయంతఃపురమునకు దీసుకరమ్మని యాజ్ఞాపించెను. అంత చెలికత్తెలు పరుగిడివచ్చి వీధినింబోవుచున్న రాజపుత్రునింగాంచి నమస్కారమొనర్చి సుంవరి యాజ్ఞం దెలిపి మేడకు దీసుకొని వెళ్లిరి. వెంటనే సుందరి రాజపుత్రుని యాసనముపై గూర్చుండ

నిచ్చి అయ్యా తమ దేయూరు? తమనామధేయం బెద్ది అని యడిగెను. రాజపుత్రుడు సుందరిని జూచి తరుణీ! నేను హిందీపురం బేలు రాజుయొక్క పుత్రుడను. నా పేరు సుందరుడు. నీకు వివాహమైనదా యని యడిగెను. అందుకు రాజపుత్రి అయ్యా! నే నొకప్రతిజ్ఞం బూనియున్నాను. దాని నెవ్వరు నెరవేర్చెదరో యట్టి వారిని వివాహమాడెదను. యింతవరకు యెందరో వచ్చి నాప్రతిజ్ఞను నెరవేర్చలేక మాచరయం దున్నవారు. మీరిపుడు యిందులకు సమ్మతించితిరేని నాప్రతిజ్ఞను దెల్పెదను. లేనిచో మీరు వచ్చినదారింబట్టి వెళ్లుడనెను.

యీమాటలను విన్నవాడై తాను రాజపుత్రుడై జన్మించి యీ కన్యవద్ద యవమానపడిపోవుటకన్న యీప్రతిజ్ఞను నెరవేర్చి యీసుందరిని వివాహమాడుటయే శ్రేయస్కరమని యోచించినవాడై, సుందరిని జూచి, నీపద్ధతులకు వొప్పుకొంటిని. నీప్రతిజ్ఞను విశదముగా తెల్పుమనెను. సుందరి యంత సంతసించినదై ఒకదమ్మిడిని చేతికెత్తుకొని రాజపుత్రుని జూచి అయ్యా, నాప్రతిజ్ఞను తెల్పెదవినుడు మీరుపుడు ధరించియుండు వస్త్రాభరణాదులం దీసివైచి వస్త్రములనుమాత్రము ధరించి ఈ దమ్మిడీ తీసుకొనిపోయి భార్యాభర్తకు ఒకపూట భోజనమునకు కావలసిన సామగ్రులను ఈదమ్మిడీనిన్ని తీసుకొని సూర్యోదయము కాకమునుపే వచ్చితిరేని మిమ్ముల వివాహమాడెదను. లేనిచో మీ జీవనాంతరము వరకు మాకుసేవకుడై మేముజెప్పిన పనులను జేయుచుండవలె ననెను. రాజపుత్రుడు దానిని విన్నంతనే దుఃఖభరితుడై హా యెంతటి పనికి పూనుకొంటిమి. యిక మనశరీరమును ఈనగరిపాలుజేయవలసినదే గాని ప్రతిజ్ఞను నెరవేర్చుట కుపాయమేదియును గనబడదని చింతించుచు తాను ధరించియుండిన వాటినెల్ల దీసి సుందరివద్ద నిచ్చి, బ్రాహ్మణుడిచ్చిన కాగితమును మాత్రము చేతబట్టుకొని, దమ్మిడీపుచ్చుకొని, వస్త్రధారుడై మేడదిగి వీధికివచ్చెను. అప్పటికి యర్ధరాత్రి వేళాయెను. వీధుల యందు ఒక్కరైనను లేరైరి. చీకటి యెల్లడను వ్యాపించియుండెను ప్రతిగృహమున్ను బంధించియుండెను. వీటినిజూడ రాజపుత్రునకు దుఃఖము పెరుగనాయెను అయ్యో నేనేమిచేయుదును ఒక్కగృహమైనను తెరచియుండలేదే. యిట్టివేళలో యీకార్యమును నేనెట్లు తీర్చగలను. అని భయభ్రాంతుడై క్రొత్తవారైనందున దారితెలియక వీధులం బడి పోవ

పోవ పూరివెలుపటికి వచ్చెను అందు నాలుగుప్రక్కల పరికించి చూడ, కొంతదూరమున నొక చిన్న వెలుతురు గనబడెను. అది దీపమైవుండ నోపునని కొంత ధైర్యము వహించి ఆవెలుతురునుబట్టి పోవ, యది ఒక గుడిసెకు దీసికొనిపోయెను. ప్రవేశించి చూడ యందొక ముసలమ్మ చిల్లర యంగడి పెట్టుకొని కూర్చొని యుండెను యిదిచూచిన బాలుడు దుఃఖం చుచు బ్రాహ్మణుని దలచుకొని వానిచేగదా మన కిట్టి స్థితిగల్గెను. అని కాగితము జ్ఞాపకమునకు వచ్చి చేతికెత్తుకొని ఆదీపపువెలుతురునందు చూచెను. అందు 2. "సూక్ష్మముతో బ్రతుకవలెను" యని వుండుట జూచి యోచనగల్గి అందు కూర్చుండెను అంగడి ముసలమ్మ బాలుని జూచి అబ్బా, నీవెవ్వడవు? యీరాత్రివేళ యేల యేడ్చుచువచ్చినాడ వని యడిగెను. బాలుడు ఆమాటలను విన్నదే కొంచెము దైన్యముతో అవ్వా నేనొక కూలివాడను. నాకు యీదినము కూలీ దొరకనందున తెల్లవారిమొదలు అన్నములేక నా బిడ్డలందరు పస్తుపడి యుండ, వారిని జూడలేక యెందైన పోయి ప్రాణముల బాపుకొందమని యిట్లొచ్చినా డనుయనెను. ఆమాటలువిని ముసలమ్మ దయాహృదయరాలై నాయనా నీవు యీ యంగడియందు కూర్చొని యుండుము నేను వంటజేసి భుజించి నీకును యన్నముపెట్టెదను. సామానులకై యెవరేని వచ్చిరేని నన్ను పిలువుము అనిచెప్పి లోనికేగెను. బాలుడు మంచిదని అంగటి యందు కూర్చొని యుండెను. ముసలమ్మ వంటచేసి భుజించి రాజపుత్రు నికి కొంత యన్నమును సిద్ధపరచి అంగడివద్దకు వచ్చి బాలుని జూచి నాయనా నీకై భోజనముపెట్టి వచ్చియున్నాను గాన లోనికేగి భుజించి రమ్మని చెప్పెను. బాలు డా మాటలకు సంతసించి మారుమాట పలుకక లోపలికి వెళ్లి అన్నమును భుజించి అంగడివద్దకు వచ్చి నిలిచెను. ముస లమ్మ బాలునిజూచి సోలిగెడు బియ్యమున్ను అందుకు తగుమైన పప్పు పదార్థ వగైరాలను యిచ్చి, నాయనా! దీనిని తీసుకపోయి నీభార్య చేతికిచ్చి వంటచేసి బిడ్డలకు పెట్టుమనుము. అనిన బాలుడు సంతో షాంతరంగుడై ఆ సామగ్రులను తన పైచెరగున మూటకట్టుకొని, అవ్వనుజూచి అవ్వా నీ వీరాత్రియందు అంగడి పెట్టికొనియున్నావే యిం దెవరు వచ్చి కొనెదరు అని యడిగెను. అందుకు ముసలమ్మ అబ్బాయీ! యీ దేశములో కొందరు రాత్రులయందు పనిచేసి

కావలసిన సామ్రగులను తీసుకపోయెదరు. అందువలన నే నంగడిపెట్టు
కొని బ్రతుకుచున్నానని తెల్పెను. అంతట బాలుడు అవ్వను జూచి
అవ్వా నీవు చేసిన ఉపకారమునకు చాలాసంతోషమాయెను. నే బోయి
వచ్చెదనని సెలవు పుచ్చుకొని మూటనెత్తుకొని పోవుచూ యీసామ
గ్రులను వంటజేయుటకు కట్టెలు కావలయునుగదా యని యోచించిన
వాడై, అచ్చటి తోపునందు పడియున్న కట్టెపుల్లలను కొన్నిటిని యేరి
మరొక మూటకట్టుకొని, రెండుమూటలను తలయందు బెట్టుకొని
సూర్యోదయము కాకముందే సుందరి యంతఃపురము జేరెను. సుందరి
యీరాజపుత్రుని జూచి, యిదివరకు మనవద్దకు వచ్చిన రాజాధిరాజులు
ఏమియునుదేక రిక్తచేతులతోవచ్చి మనవద్ద చరనొంది యున్నవారు.
అట్లుగాక యీరాజపుత్రుడు మనము తెల్పిన సామ్రగులను దెచ్చినట్లు
న్నది. నేటికి నాప్రతిజ్ఞ ఫలించినది గాబోలు అని సంతోషభరితురాలై
రాజపుత్రుని కెదురేగి నమస్కారము లాచరించి వారు తెచ్చిన మూటల
నందుకొని విప్పిచూడ, తాను కోరినప్రకారము భార్యాభర్తకు ఒకవేళ
భోజనమునకు తగినసామ్రగు లందుండెను. వెంటనే సుందరి తనతలి
దండ్రుల రప్పించి, రాజపుత్రునిజూచి సిగ్గుగలదై నాథా యీసామ్రగుల
నెట్లు తెచ్చితిరి. నేనిచ్చిన దమ్మిడెక్కడని యడిగెను. వెంటనే సుందరుడు
దమ్మిడీనెత్తి సుందరి చేతికిచ్చి, నగరు విడచిపోయి అంతవరకు జరిగిన
సంగతుల నంతయు తెల్పెను రాజు సుందరుని బుద్ధి చాతుర్యమునకు
మెచ్చుకొని, సేవకులబంపి అంగడియమ్మె ముసలమ్మను దీసుకరమ్మని
యాజ్ఞాపించెను. సేవకులువెళ్లి ముసలమ్మను దోడ్తెచ్చి రాజుగారి చెంత
వదలిరి. రాజు ముసలమ్మను జూచి అమ్మా నీ వెచ్చటుండుదానవు అని
యడిగెను. ముసలమ్మ భయపడుచూ రాజునుజూచి నాయనా నేను
మీనగరమునకు వెలుపల నుండు తోపులో గుడిసెవేసుకొని యందొక
అంగడి నుంచుకొని అందుచే జీవించుచున్న దానననితెల్పెను. ఆమాట
లనువిన్న రాజు అమ్మా, నీవద్దకు రాత్రి యెవరు వచ్చిరని యడిగెను.
అందులకు ముసలి గడగడ వణకుచు అయ్యా, రాత్రి ఒక కూలివాడు
వచ్చి నాయొద్ద యేడ్చెను. నేను వానికి అన్నముపెట్టి, వాని భార్యాబిడ్డ
లకు తగిన భోజనసామ్రగులను యిచ్చిపంపితినని తెల్పెను. ఆమాటలను
విన్నదే రాజు చాలాసంతోషించి, రాజపుత్రుని జూచి అయ్యా, నేటికి

నాపుత్రికయొక్క కష్టములు తీరినది. నీవు నాపుత్రికను వివాహమాడి నారాజ్యమును పరిపాలింపుమని వేడుకొనెను. మామగారికి నమస్క రించి, నే నింకను కొన్ని దేశములు యాత్ర జేయవలసియున్నది గాన పోయి మరల నారాజ్యమునకు పోవునపుడు యీదారిని వచ్చి మీ యిష్టానుసారముగా వివాహమాడెద నని సమాధానపరచి సెలవుదీసి కొని సుందరివద్ద నుండిన తన వస్త్రాభరణాదులం గైకొని ధరించి, కంఠ హారమును దీసి అంగటి ముసలమ్మ మెడయందు వేసి, అవ్వా నీవలన నాకు రాజ్యము లభించినది గాన నేనిందొచ్చువరకు నీవిం దేయుండుమని చెప్పి సుందరికి వొప్పగించి, సుందరివద్ద సెలవు దీసుకొని వెడలెను.

అచ్చట పూటకూళ్ల పెద్దమ్మ, రాజపుత్రుడు ధరించియుండు ఆభర ణాదులయందు మనస్సు దగిలినదై, రాత్రికి రాకుమారుడు భోజనము నకు వచ్చినదే, అన్నమునందు విషము పెట్టి చంపి, నగలనుదీసుకొని శవ మును తన పెరటియందు పూడ్చివేయవలయునని తీర్మానించినదై రాత్రి భోజనమును చక్కగా తయారుచేసి, రాజపుత్రునిరాకకై యెదు రుచూచు చుండెను. అట్లు యర్ధరాత్రివరకు బాలుడు రానందున, వాడు రాజపుత్రివలలో దగులుకొనియుండునని తలచి, తన ప్రయత్నము కొన సాగనందున మిక్కిలి చింతించి నిరాశజెంది నిద్రించెను.

బాలుడు ఉదయమగునప్పటికి పూటకూళ్లింటికివచ్చి, పెద్దమ్మను జూచి అమ్మా, నాకై నీవు రాత్రివంటజేసి అలసితివా అని యడిగెను. అందుకు పెద్దమ్మ, నాయనా రాత్రి నేను నీకై అర్ధరాత్రివరకు వేచియుండి నీవురానందున అన్నములో నీళ్లుబోసి వుంచినాను. ఆ సద్దియన్నమును తినిపొమ్మనెను. రాకుమారుడు అమ్మా నేను దూరప్రయాణము పోవల యును. నాకు కట్టన్నము కట్టియిమ్మని పెద్దమ్మచేత ఒక్కవరహా పెట్టెను. ముసలమ్మ సంతోషపడి యింటిలోనికివెళ్లి, అన్నమునందు విష మునుగలిపి మూటగట్టి తెచ్చి బాలునికిచ్చి, కుమారా రాత్రి నీవెందేగి యుంటివని యడిగెను. బాలుడు రాత్రిజరిగిన విషయములంతెల్పి గుఱ్ఱము నెక్కి ప్రయాణము సాగించెను. పూటకూళ్ల పెద్దమ్మయు బాలుడు యెచ్చోటన్నము దినునని వానిని వెంబడించెను.

3. భుజించునపుడు ముందు కాకికిపెట్టి వెనుక భుజించుము.

రాకుమారుడు గుఱ్ఱముపై బోవుచు బ్రాహ్మణుని దలచి సంతో

క్షించినవాడై, తనవద్దనున్న కాగితమును యెత్తిచూడగా అందు "భుజిం చునపుడు ముందు కాకికిపెట్టి వెనుక భుజించుమని" యుండుట గమనిం చెను. అప్పటికి రెండుజాముల ప్రొద్దయినందునను, ఆకలి యగుటంజేసి సమీపములో మంచినీళ్లు గుంటనుజూచి, గుఱ్ఱముదిగి అన్నపుమూ టనువిప్పి యచ్చటనున్న కాకులకు ఒకముద్ద యన్నమును వేసెను. వెంటనే ఆయన్నమును తిన్న కాకులును గద్దలును గిరగిరతిరిగి పడి చనిపోయెను. దీనినిజూచిన బాలుడు కోపోద్దీపితుడై ఖడ్గంబు చేబూని పూటకూళ్ల పెద్దమ్మనుచంపదలచి గుఱ్ఱమెక్కి సుందరీపురమునకై మరలెను. వెంటనరు దెంచుచున్న పెద్దమ్మ బాలునిజూచి గడగడ వణకుచు, అందు దాగుటకు మరుగులేనందున పరుగెత్తుటకు శక్తిలేనందున దారింబడి తల్లడిల్లుచుండ బాలుడామెను జూచి, మత్తగజ కుంభములపై బడు సింహమువలె ముస లమ్మపైంబడి వెంట్రుకలంబట్టి లేవదీసి, ఓసీ దురాత్మురాలా ! నన్నేల చంపదలచితివని యడిగెను. ముసలమ్మ మారుబల్కలేక భయభ్రాంతు రాలై నాయనా, నీవు ధరించియుండు ఆభరణములకై యాసించి నేనిట్టు జేసితిని, నా లేమితనమునకు వగచి యట్లుజేసితిని. గనుక నన్ను స్వేయిష్ట మైనట్లు జేయుము అని విలవిలదుఃఖించెను. బాలుడుచూచి దయార్ద్ర హృదయుడై ఆహా, యీ యాభరణములవలనగదా మనప్రాణము లకు హానిగలుగుచుండెను. గాన యివి మనవద్దనుండకూడదు. ఈముస లమ్మ మనకీబుద్ధి గరపెనని తలచి వాటిని పెద్దమ్మచేతికిచ్చి, అమ్మా ! నీవిట్టిపనిచేసినందున నాకు బుద్ధివచ్చినది. నేను దేశసంచారము బోవుచు న్నాడను గనుక ఈ యాభరణములు నాయొద్దనున్న నా ప్రాణములకు హానిగల్గునని నిన్ను మన్నించితిని. నీ విట్టిపనుల నెన్నటికిని జేయకుము. అట్లు జేసితివేని నీశిరస్సును ద్రుంచుదునుసుమా. జాగ్రత్త యని బెద రించి గుఱ్ఱమెక్కి మరల ప్రయాణము జరిపెను.

ముసలమ్మ ఆభరణముల దీసుకొని తనయింటికివచ్చి రాజపుత్రుడు తనను మన్నించి ఆభరణముల నిచ్చినందులకై, వాని కుశాగ్రబుద్ధికిని గడుసంతసించి, బాలునిరాకకై యెదురు చూచుచుండెను.

## కమలావతి కథ.

రాజకుమారుడు కొలదిరోజులు చిన్నచిన్న గ్రామములు తిరిగి

తునకు కమలావతియను పట్టణముజేరి, అందు పూటకూళ్ల అక్కమ్మయిం టికిపోయి ఒక్కవరహాయిచ్చి భుజించి, అక్కమ్మనుజూచి అమ్మా యీ పురంబునగల విశేషంబులెవ్వి యని యడుగ, అక్కమ్మ బాలునిజూచి నాయనా యీ రాజ్యంబునేలు కమలావతికి యింకను పెండ్లి కాలేదు. ఆమెను వివాహమాడవలెనని రాజు లెందరోవచ్చి ఆమెవద్దకుపోయిన వారేగాని ఒక్కరైనను అందుండి బయటికివచ్చినవారులేరని తెల్పెను. అదివిన్న బాలుడు ఆహా యిదేమి విచిత్రముగా నున్నది. నేనుపోయి ఆకారణమును దెలుసుకొని వచ్చెదను. అమ్మా నేనువచ్చునంతవరకు యీ గుఱ్ఱమును జూచుచుండుమని చెప్పి బయలుదేరెను. పూటకూళ్ల అక్కమ్మ వలదని చెప్పినను వినక బాలుడు పాదచారియైపోయి కమలా వతిమేడంగని అందున్న సేవకులనుజూచి, ఓరీసేవకులారా ! మీరిప్పుడే మీ రాణియొద్దకు చని నిన్ను వివాహమాడ రాజపుత్రుండొచ్చియు న్నాడని తెల్పుడనెను. సేవకులు బాలునిమాటలు విన్నవారై త్వరితము గావెళ్లి తమరాణిగారి కాసంగతిదెలిపిరి. యామాటలను విన్న కమలా వతి దుఃఖమనస్కురాలై ధర్మాత్ము లెందరోవచ్చి నన్ను వివాహమాడ లేక హతమైపోయిరి. అయినను వీరెంతటివారో చూచెదగాక యని ధైర్యమువహించి మేడదిగివచ్చి రాజపుత్రుని కెదురేగి అయ్యా రండు అని తనయంతఃపురమునకు దీసుకపోయి పడకటింటియందు కూర్చుండ బెట్టి వారియొక్క పూరు పేరు విచారించి, అయ్యా మీరిందే కూర్చొని యుండుడు, నేను భుజించివచ్చెద ననితెల్పి, వంటయింటికివెళ్లి భుజించి యందే పరుండి నిద్రించెను.

4. శయనించునపుడు పడక తట్టిచూచి పరుండుము.

రాజపుత్రుడు కమలావతి రాకకై యర్ధరాత్రి వరకు మేల్కొని కాచియుండి, యప్పటికిని రానందున విసిగి, బ్రాహ్మణుని దలచికొని కాగితమెత్తిచూడ శయనించునపుడు "పడక తట్టిచూచి పరుండు"మని యుండ జూచి, యిప్పటికి చాలారాత్రి యైనందున ప్రక్కనున్న మంచ ముపై పరుండ మనస్సుగలవాడై బ్రాహ్మణుని వాక్యము మేరకు మం చమును సమీపించి పరుపును తట్టెను. ఆక్షణముననే మంచముపైనున్న పరుపు తటాలున క్రిందపడిపోయెను. పరుపు దిగువజారినవెంటనే క్రింది గృహములోనుంచి యిద్దరు రాక్షసులు ఘోరాకారములతో వెలువడిరి.

అంతలో రాకుమారుడు కోపోద్దీపితుడై ఖడ్గముచే దుష్టరాక్షసులశిరము లంబడవేసెను. వారు వికారముగా నరచుచు క్రిందబడి చచ్చిరి. యీ దుష్టులచేత నెంద రత్తమైరి, యంతకు ఆకమలవతియే కారణురాలుగాన దానినిన్ని రాక్షసులవలె బరిమార్పవలెనని తలచి మేడంతయువెదకి గానక చింతించినవాడై వంటింటి కేగిచూడ, యందునిద్రించుచుండ గని లేపి సిగను బట్టికొని ఓసీ దుర్మాత్ములారా, యిట్లెన్ని రోజులుగా జేయుచున్నావే, యిట్లెందరి ప్రాణముల దీసికొంటివని గద్దించి యడిగెను కమలవతి రాజపుత్రునిచేనున్న ఖడ్గమును విమర్శించి, రక్తమయమై యుండుటగాంచి, అయ్యో నేనేమిచేయగలను. నన్నీరాక్షసులు విడువక నాదరికి వచ్చినవారిని మోసగించి భక్షించుచున్నారు. నేను వారికి భయపడి యూడుదాన నైనందున యేమియు చేయునదిలేక యేశూరునిచే వీరిని సంహరించి వారిని మనము వివాహమాడబోతున్నామని ప్రతి రోజు దేవుని ప్రార్థించుచు దుఃఖించు చున్నదానను యని గడగడ వణకుచు దెల్పెను. వాటిని విన్న రాజకుమారుడు కమలవతి వెంట్రుకలను విడచి వీరికి నీవెట్లు దొరకితివి ? నీవెవ్వరవు ? యెందుండుదానవని యడిగెను.

కమలవతి యందులకు నేనొక రాజపుత్రిని, నాయొక్క చిన్నవయసున నాతలిదండ్రులతోడి యంతఃపురమున నిద్రించుచుండ యీ రాక్షసు లిందువచ్చి వారిని జంపి నన్ను దీసుకపోయి యరణ్యంబున నుంచి పెంచి పెద్దజేసి వారికి నరమాంసము దొరకనందున, యీ యేర్పాటులంజేసి నన్ను వివాహమాడ వచ్చినవారిని భక్షించుచున్నవారు. ఇప్పటికి మీరు నాపాలి దైవమైవచ్చి వారిని సంహరించి నన్ను రక్షించితిరి గాన మీరే నాకుభర్త. నన్ను వివాహమాడి యీరాజ్యం బేలుకొనుమని యనేకవిధముల బ్రార్థించెను

రాజకుమారు డంతట కమలవతిని యూరడించి, కామినీ ! నేను నాతండ్రి యానతిప్రకార మింక కొలదిదేశములకు పోవలసియున్నది. గాన నాపని దీర్చుకొని మరలి నారాజ్యమునకు బోవునపుడు వచ్చి నిన్ను వివాహమాడి దోడ్కొని వెళ్లెద నని సమాధాన పరచి యింతలో తెల్లవారినందున సేవకులం బిలచి యీరాక్షసుల శవముల నొక బండిమీద నుంచి యీపురప్రదక్షిణం బొనర్చి కాల్చవేయుడని

యాజ్ఞాపించి, కమలవతియొద్ద సెలవుదీసుకొని బయటికిరాగా, రాత్రి రాక్షసులయొక్క యరపులను విన్న పురజనులందరు యానగరును జుట్టుకొని యుండిరి. వారినిజూచి రాజపుత్రుడు రాత్రి జరిగిన సంగతుల నెల్ల దెల్పి యారాక్షసుల శవముల దెప్పించి యందరికి జూపించెను. దానిని జూచిన పురజనులందరు సంతోషించి సుందరుని యనేకవిధముల కొనియాడుచు వారివారిండ్లకు జనిరి. యదిజూడవచ్చిన పూటకూళ్లక్కమ్మను సుందరుడు బిలచి అమ్మా, నీవలన నాకీవిషయములు దెలిసి నేనింతటి భాగ్యమునకు ప్రాప్తుడనైతిని గాన నేను మరలి యిందువచ్చువరకు నీవు కమలవతిచెంత నుండుమని కమలవతికి యక్కమ్మను యొప్పజెప్పి, అక్కమ్మ యింటికిపోయి తాను విడిచి వచ్చిన గుఱ్ఱమును దీసికొని ప్రయాణమాయెను. యందందు దిరుగుచు గ్రామములు, నదులు, గుట్టలు, యడవులు దాటుచు పోయి నొకపట్టణము జేరెను. సుందరు డందుప్రవేశించి పూటకూళ్లింటిని విచారించుచుపోయి కనుగొని పూటకూటికి ఒక్కవరహానిచ్చి సౌఖ్యముగా భుజించి, మార్గాయాసము దీర్చుకొని, తాంబూలము ధరించుచు పూటకూళ్లవ్వను జూచి, అవ్వా! యీపురంబున గల విశేషము లెవ్వి?

వకులవతి కథ.

ముసలమ్మ సుందరుని జూచి నాయనా, యీపట్టణమున వకులవతి యనుదాసి యొకటున్నది. దానిని మోహించుటకై ప్రతిరోజు ఒక్కొక్కరి వంతున వెళ్లి తెల్లవారు నప్పటికి చనిపోవుచున్నారు. దీని యొక్కమర్మ మెవరికి దెలియలేదు యిదియే యీపట్టణమందలి ముఖ్య విషయమని తెల్పెను. యీమాటలువిన్న సుందరుడు హాశ్చర్యపడి యిదేమి వింత. యిట్టిదాని నే నెందుజూడలేదు. దీనినిగమనించెదను గాక. యని మనంబున దలచినవాడై అవ్వా, నాకు రాత్రికి భోజనముతయారు చేయుము. నేను రాత్రికి భుజించి యా వకులవద్ద కేగి యీవిషయముల గ్రహించెదనన ముసలమ్మ బాలునిజూచి, నాయనా నిన్నుజూడ చిన్ని గారాబ రాజపుత్రునివలె నున్నావు. రాజు లెందరోవచ్చి మార్గముదెలియక దానివాతబడి ప్రాణముల గోల్పోయిరి. గాన నీవేల బోయెదవని జెప్ప సుందరుడు అవ్వా, రాచకులమున బుట్టి యిట్టి యాపదలనువిని

దీర్పకపోవుట రాజులకు నీతిగాదు. గాన దానిచే నాప్రాణములు పోయి నను పోవుగాక నేనూరక వెళ్లననిబల్కి కొంతవడి నిద్రించెను యిదివిన్న ముసలమ్మ మారుబల్కక రాజపుత్రునికై భోజనము తయారుచేయుచుం డెను కొంతవడికి రాజపుత్రుడు లేచి చీకడిరుడిన తదనంతరము భుజించి తాంబూలము వేసుకొని, ముసలమ్మచే "సుఖముగా పోయిరమ్మని" దీవ నలబడసి, ఒక్కవరహా ముసలమ్మకిచ్చి గుఱ్ఱమునెక్కి వకులవతి మేడకై బయలుదేరెను.

రాజకుమారుడు మేడను సమీపించగా ద్వారము మూసియుం డెను అందొకశాసనము నుండ జూచి యిట్లుచదివెను. "నావద్దకు రాగో రువారు వారి ప్రాణములమీాది యాశనువిడిచి యిచ్చట కట్టియుండు డమారును వాయించినయెడల ద్వారము తెరువబడును" యీప్రకారం చదివి యందున్న డమారును పెద్దధ్వనికలుగునట్లు వాయించెను. డమా రుశబ్దమునువిన్న పురజనులు పరుగునవచ్చి సుందరుని గాంచి అయ్యో, ఆమెవద్దకు పోకుడు. అట్లు పోతిరేని మీాప్రాణములు తప్పక పోవును యని ఒకపట్టున తెల్పిరి. సుందరుడువినలేదు. యింతలో డమారుశ్శబ్దము విన్న వకులవతి యీాడిన మెట్టిపుణ్యాత్ములో యిట్టి ఆనందదాయక మగు శబ్దమును కలుగజేసిరి. ఈ ధీరుడు నా కష్టములదీర్చి నన్ను వివా హమాడెదరేమో చూచెదగాక యని సేవకులబంపి ద్వారమును దీయిం చెను. వెంటనే సుందరుడు లోనికింజనెను.

సుందరుని గాంచిన వకులవతి యెదురేగివచ్చి . సుందరుని తన యంతఃపురములోని పడకగదికి తీసుకపోయి కూర్చుండబెట్టి, సర్వోప చారంబులజేసి పేరు, వూరిపేరు యడిగెను. యంతలో వకులవతి వికార స్వరూపముతో మైకము కమ్మినదై పడకపైబడి గురుకపెట్టుచు నిద్రిం చెను. దీనినంతయు గాంచుచుండిన సుందరుడు హాశ్చర్యమానసుడై నొకబల్లపై కూర్చొని, యేమిజేయుటకును తోచక యోచించుచుండెను.

5. దూరప్రయాణం జాగ్రత్త.

అంతట బ్రాహ్మణుడు మనస్సునకురాగా వాని కాగితమెత్తి పరి కింప "దూరప్రయాణం జాగ్రత్త" యని వుండుటగాంచి, కొంత సందే హించి నారేయెల్ల నిద్రపోక మేలుకొనియుండుట మంచిదని తలచిన వాడై కాలము గడుపుచుండెను.

కొంతసేపటికి వకులవతి పెద్ద గురకబెట్టసాగెను. సుందరుడు వకులవతిని గమనించెను. అప్పుడు వకులవతి యొక్క ముక్కుద్వారముల రెంటియందును రెండుపాములు బుసగొట్టుచు వచ్చుచుండుటను సుందరుడుజూచి, తన ఖడ్గమును బైటికిదీసి, దానిచే ఆరెండుపాములను నరికివేసెను ఆపాములను జంపిన వెంటనే వకులవతి గాఢ నిద్రనుండిలేచి పాములను జూచి భయపడి బిగ్గరగాయరచి సుందరునిపై బడి కౌగలించుకొనెను. రాజపుత్రుడు వకులను యోదార్చి యేల యిట్లు భయపడెదవు. యివి చచ్చినపాములనెను. అంతట వకుల నాథా, యీపాము లెందుండి వచ్చినవి. మీరెట్లు చంపితిరని యడుగ, సుందరుడు జరిగినవిషయముల నెల్ల తేటపరచెను.

వకులవతి యంతట సుందరునిజూచి నమస్కరించి నాథా, నేడు గదా నాజన్మము సఫలమాయెను. పరులచే గలుగునిందలు బాసెను. ఈపాములచే యింక నెందరి ప్రాణములు బోవనుండెనో మీవలన నేడిట్టి యాపద బాసెను. నేను ధన్యురాలనైతిని. గాన మీరు నన్నువివాహమాడి యీనగరికి రాజై పరిపాలించుడని వేడుకొనెను సుందరుడు వివాహమాడ సందేహించి వకులతో భామా, నీవుదాసివి. యెందరినో మోహించియుండుదానవు గాన నేనెట్లు నిన్ను విహమాడగలను నీవే చెప్పుమనెను.

వకులవతి యందులకు సుందరుని జూచి నాథా, నేను దాసిని గాను యీపురమును యేలుచుండిన రాజుయొక్క కుమార్తెను. నాకు యీకష్టము సంభవించినది మొదలు నా తలిదండ్రాదులును, యీ నగరమునందుండిన సకల జనులును, యీ పాములచే గతించిపోయిరి. నేను రేత్రిబవలు యొకచో నిద్రజెంది యుందును. ఒరులను నేను జూచి యెరుగను. నేడు మిమ్ములను జూడ ఆభగవంతుడే నాకు నిద్రాభంగము జేసి మిమ్ముల పొడగాంచె నని నుడివెను. అంతట సుందరుడు సంతసించి, వకులా, నేను నిన్ను వివాహమాడుటకు సమ్మతించితిని. నే నింకను కొన్ని దేశముల కేగవలసియున్నది. గాన పోయి నాపనిని పూ_ర్తిజేసుకొని మరలి నారాజ్యమునకు పోవునపుడు నిన్ను వివాహమాడి దీసుకొని పోయెదనని పల్కెను. యందులకు వకులవతి నాథా, మీరాజ్యం బెయ్యది ? మీ రేల యిట్లొచ్చితిరి అని యడుగ, సుందరుడు తనరాజ్య

మును వదలినది మొదలు యింతవరకు జరిగిన కథను దెల్ప వకులవతి చాలా సంతసించినదై, రాజపుత్రుని భుజించి ప్రయాణము సల్పుమని చెప్పి వంటజేయుచుండెను. ఇంతలో తెల్లవారినందున పురజనులు రాజపుత్రుడు చనిపోయియుండు నని తలంచినవారై శవమును జూడ నగరి చుట్టును మూగియుండిరి. సుందరు డంతట తెల్లవారినందున బయటకేతెంచెను వానిని జూచిన ప్రజలందరు హాశ్చర్యపరవశులై, అయ్యో, వీరెట్లు బ్రతికితిరని యందరొక్కపెట్టున యడుగ, సుందరుడు రాత్రిజరిగిన సంగతులనెల్ల వివరముగా దెల్పి, సేవకులబంపి యా రెండుపాముల తుంటలను దెప్పించి, యందరికి జూపించి, పురప్రదక్షిణజేసి కాల్చివేయునట్లు ఆజ్ఞాపించెను.

సుందరు డంతట యంతఃపురమునకు పెళ్లి స్నానసంధ్యావందనాదులదీర్చుకొని భుజించి, వకులవతి యొద్ద సెలవుపుచ్చుకొని గుఱ్ఱమెక్కి ప్రయాణమై పోవుచుండ, తన భార్యపై మనస్సుగలిగి, అయ్యో నిండు గర్భిణియగు భార్యను వదలి యిట్లొచ్చితిమే దానిగతియెట్లున్నదో యని చింతించిన వాడై గుఱ్ఱమును తనరాజ్యమార్గమునకు ద్రిప్పెను. అట్లు పోవుచు రాత్రి ఒకజాముపేళకు తనపట్టమునకు వచ్చి యొకచెట్టుక్రింద విడిసి, కట్టుడుయన్నపుమూటనువిప్పి యందు కొంతయన్నమును భుజించి మిగత యన్నమును మూటగట్టి గుఱ్ఱముపై బెట్టి, గుఱ్ఱమును అందే కట్టివేసి, సుందరుడు తన యంతఃపురమునకు పోయి, ద్వారములు బంధించియుండుట జూచి గోడలపైనెక్కి తన పడకగదికి సమీపించి గవాక్షమున జూచెను. అందు తనభార్య పుత్రుని ప్రక్కనవేసుకొని నిద్రించుచుండ జూచెను.

6. ముందు కోపం నివారణ.

హా! యీ దురాత్మురాలు నేను పోయినవెంటనే పరపురుషుని మోహించి వానితో పరుండియున్నదని మహాకోపానలముచే జుట్టబడి చేతికి ఖడ్గమును దీసికొని గవాక్షమందుండి లోనికి దుమికెను. అంతలో భగవంతుని యనుగ్రహామువలన బ్రాహ్మణుని కాగితముపై మనస్సు తగిలి యెత్తిచూడ "ముందుకోపం నివారణ" యని యుండుట గాంచి, బ్రాహ్మణుని వాక్యముల వలనను తాను పొందిన లాభమును తలచి, తనకు గలిగియుండు కోపానలమును యణచుటకు సమయముగాక నుండి

నను బ్రాహ్మణుని వాక్యముల యందుగల నమ్మకముచే తన కోపమును చల్లార్చి, శాంతమును వహించి, యింకా నేమిజరుగునో చూతమని యొకవైపున నిలచెను.

తల్లిప్రక్కనున్న బాలుడు యాకటికి నిద్రబట్టక లేచి అమ్మా ! నా కాకలియగుచున్నది యని యేడ్చెను. కుమారుని యేడ్పుశబ్దమునకు తల్లి లేచి కుమారా, యీవేళయందు మనకెవ్వ రన్నంపెట్టగలరు. మీతండ్రి గారు వెళ్లినది మొదలు మనలను యీగృహమున వేసి, జెరసాలయందు ప్రతివేళకు యన్నమును దెచ్చివేయుచున్నారే. యిప్పుడు నేనేమిజేయు దును. యెందుండి యన్నముదేగలను మీతండ్రిగారెందేగిరో, యెపుడు వత్తురో, యిక యిందుండగూడదు. ఒక బావియందుపడి ప్రాణముల విడిచెదము రమ్మీయని బాలునెత్తుకొని ద్వారమును దెరువబోయెను.

సుందరుడు వీటినంతయు జూచి, ఆహా వీరిని యీఖడ్గమునకు పాత్రుజేయ దలచితినే, బ్రాహ్మణుని వాక్యరచనవలనగదా నాకోపము చల్లారి, వారిప్రాణములు దక్కెనని సంతసించి భార్యకడ్డముబోయి ఓప్రియా, రత్నావళీ, యెక్కడికి బోవుచున్నదాన వనిన మాత్రమున, నాధునిజూచి హానాధా యని మరేమియు పలుకలేక ఆనంద బాష్పముల రాల్చుచు నిజనాధుని కౌగలించుకొనెను. సుందరుడు భార్యను ఊరడార్చి బిడ్డనెత్తుకొని, నాయనా నేను పోవునపుడు నీవు గర్భములోనుంటివి. నీముద్దులను జూచుటకు నాకు ప్రాప్తిలేక నేను దేశాంతరగతుడైతిని. నేడు నేనిందు రానిచో మిమ్ముల జూచుభాగ్యము లేకపోవును భగ వంతుడు నన్నిందు రప్పించి మీప్రాణములను గాపాడెను. యని భార్య నుజూచి కోమలీ, మిమ్మేల యిట్టి శ్రమలుబెట్టుచున్నారని యడిగెను.

రత్నావళి ప్రాణనాథుని జూచి నాథా, మీరు రాజ్యమువదలిన వెంటనే నన్నీ గృయందుంచి, మనదాదులు మీతండ్రిగారికి తెలియక నన్నును బిడ్డనున్ను గాపాడుచున్నవారు. నేనీబిడ్డవలన యిన్నిరోజులు ప్రాణముల నిలుపుకొని యున్నదానను, లేనిచో యపుడే గతించియుందు నని యేడ్చెను. సుందరుడు భార్యను ఓదార్చి, ప్రియా, నీవింక చింతిం పకుము. నేనువెళ్లి రేపటిదినము సాయంకాలమువేళకు సైన్యములను దెచ్చి, వారి గర్వముల నణచెదనని కోపముచే గవాక్షినుంచి క్రిందికి దుమికి గుఱ్ఱమువద్దకు రాగా గుఱ్ఱమునకు కట్టివున్న యన్నపుమూటను

విప్పి గవాక్షమున జూచుచున్న రత్నావళి చేతికి విసరివైచి, యీయన్నమును నీవును బిడ్డయును భుజింపుడని, గుఱ్ఱమెక్కి వేగముగా వకులవతి పట్టణపుదారి బట్టెను.

సుందరుడు గుఱ్ఱమును వేగముగా దరుముచు పోయి పట్టణము జేరి, వకులవతికి సమాచారములం జెప్పి, అందుగల సైన్యములనున్ను వకులవతినిన్ని దోడ్కొని, కమలవతి పట్టణమునకు వచ్చి, యందుండు సైన్యములను కమలవతిని దోడ్కొని, సుందరి పట్టణమునకు వచ్చి, యందుగల సైన్యములనున్ను సుందరినిన్ని బిలుచుకొని, తనరాజ్యమునకు వచ్చి, వూరి వెలుపల డేరాలు వేయించి, రణభేరి మొదలుగాగల వాద్యములను బ్రయోగించెను. యీశబ్దములను విన్న సుందరుని తలిదండ్రి సహోదరులు దుఃఖించుచు, అయ్యో, మరల నెవ్వరో శత్రువులు యుద్ధభేరి వాయించుచున్నారే. మనము సహాయములేని వారమై యున్నారమే మనమెట్లు వీరితో పోరగలము యని చింతించినవారై పాదచారులై సుందరుని డేరాలవద్దకు వచ్చుచుండిరి. తల్లిదండ్రి సహోదరు పాదచారులై నడచివచ్చుటగాంచి సుందరుడు ఖిన్నుడై, వీరేలయిట్లు వచ్చుచున్నవారు. దీనికి యేదేని దారిగలదాయని యోచించెను

7. పెద్దలను దూరకుము.

అంతట బ్రాహ్మణుని కాగితమును దీసిచూడ యందు "పెద్దలను దూరకు" మని యుండుట జూచి చింతించి, యిట్టి దురాత్ములను దూరకుండుటెట్లు. నేను దీనిని చదువక యైన నుండకపోతిని. యని పలువిధముల చింతిల్లుచు, యీ వాక్యముల వలనగదా, నాకు యింతటిసైన్యము, రాజ్యములు, భార్యలు గలిగిరి ఇందుచేతగదా నేను వారిని యుద్ధమునకుబిలువ శక్తివంతుడనైతిని లేనిచో వీరివలననే వుందునుగదా. యని మనసున శాంతము వహించి, వీరి క్షేమముల గమనించెదగాక యని కూర్చుండెను అంతట తల్లి దండ్రి సహోదరులు తనడేరా సమీపించుట జూచి యెదురేగి సాష్టాంగదండప్రమాణంబు లాచరించెను. రాజు కుమారుని గుర్తుపట్టలేక దిగ్భ్రమజెంది అయ్యా, మీరెవరు ? మీరేల మామీదికి యుద్ధమునకు వచ్చితిరి ? అట్లువచ్చియు మాకు నమస్కారము జేయుచున్నారు. మేము రాజ్యముల దారబోసికొని యనాధులమైయుండ మాపై కేలవచ్చితిరి యని దుఃఖముతోటి యడిగెను. సుందరు డందులకు

మీరాజ్యమేమాయెను. మీరేల యనాథులైతి రనెను. రాజందులకు అయ్యా, మాతో శత్రురాజులు యుద్ధముజేసి గెలిచి మారాజ్యమును యపహరించి, మాప్రార్థనల నంగీకరించి నా మూడవపుత్రుడు యూరలే నందున, వాడు వచ్చువంతవరకు మమ్ముల యీనగరున యుండుటకు సమ్మతించిరి. నాపుత్రుడునచ్చి ధైర్యసాహసములతో వారినెదిరించి యుద్ధము జేసి గెలిచెనేని మాకు రాజ్యము దక్కగలదు. లేనిచో మేమిందుండి లేచి పోవలసినవారమని తెల్పెను. ఈమాటలను విన్న సుందరుడు కోపాగ్రేసరుడై ఓ దురాత్ములారా ! నీతిలేక రాజ్యమును పరిపాలించు యవివేకులకు గలుగు చేటిదియే. నీ మూడవపుత్రుని భార్యబిడ్డ లెచ్చట నున్నవారు? యిప్పుడే వారి నిచ్చటికి రప్పింపుడని తెల్పెను.

రాజు సుందరుని భార్యాబిడ్డలను రప్పించినంతట సుందరుడు రాజును జూచి అయ్యా, మీరు వీరిరువురిని యెన్నికష్టముల పాల్జేసితిరి యని కఠినముగా బలుక, వానిమాటలకు మారుబల్కక వూరకుండుట జూచి, అయ్యా నీవు రాజువైయుండి, నీకోడలు గర్భిణిగా యుండు టెరిగి; ఆమెను పురుషునితో విడనాడ జేసినందున, మీకిట్టి కష్టములు సంప్రాప్తములైనవి. గాన మీరిపు డామెను ఆదరించితిరేని మరల మీ రాజ్యము మీకు రాగలదని తెల్పెను సుందరుని తలిదండ్రి సహోదరు లంతట రత్నావళినిజూచి అమ్మా మేము జేసిన తప్పులను మన్నింపు డని వేడుకొనిరి.

సుందరుడు దయాస్వరూపుడై తండ్రిపాదముల పై బడి దండము లిడి, తండ్రీ ! నేజేసినతప్పుల మన్నింపు డని కౌగలించుకొని, తండ్రీ ! చూచితిరా, బీదబ్రాహ్మణు డానాడు యిచ్చిన కాగితము చేత నన్ను రాజ్యము విడచి బారదోలితిరి. నేనా కాగితము చేత ఇంతసైన్యములున్ను, మూడురాజ్యములనున్ను, ముగ్గురుకోడండ్లనున్ను దెచ్చినాడనని వారిని జూపెను. వారు ముగ్గురువచ్చి అత్త మామ బావ యక్కలకు మ్రొక్కిరి. రాజు వారిని చేరదీసి పుత్రునిజూచి కుమారా ! నీవెట్లు వీరిని దెచ్చితివి. మూడురాజ్యముల గెల్చితివని యడిగెను.

8 శత్రులను వధింపుము.

సుందరుడు తండ్రినిజూచి తాను రాజ్యమును విడచిపోయినది మొదలంతవరకు జరిగిన వృత్తాంతములనెల్ల జెప్పి, వారిని సంతోష

పరచి, బ్రాహ్మణుడిచ్చిన కాగితమును జూచి, అందులో నున్న యేనిమిది వాక్యములలో యిప్పటికి యేడు వాక్యములు జరిగినవి, యింక నొకవాక్యము మాత్రమును జరుగవలసియున్నది అదియేమనగా "శత్రులను వధింపుము" అని యుండుటబట్టి తండ్రీ, నేనుపోయి శత్రులను ద్రుంచి రాజ్యమునుగైకొని వచ్చెదనని జెప్పి గుఱ్ఱమునెక్కి సైన్యమును దీసుకొని తండ్రివద్ద సెలవుపుచ్చుకొని, వేగముగా బోయి శత్రురాజుల పట్టణమును సమీపించి పురమునకు వెలుపల డేరాలువేయించి యుద్ధభేరీలను వాయించుటకు యాజ్ఞయిచ్చెను యీభేరీలనువిన్న శత్రురాజు తన సైన్యమును దీసుకవచ్చి యెదిరించెను. సుందరుడు వారితో ఘోరయుద్ధముసల్పి వారిసైన్యములెల్ల గూల్చి, రాజ్యమును ముట్టడించి, వశపరచుకొని, రాజునుబట్టి తీసుక వచ్చి తండ్రివద్ద నిలిపెను. వానిని జూచిన సుందరుని తండ్రి హాశ్చర్యపడి పుత్రుని పరాక్రమమునకు సంతసించి, పుత్రునిబిలచి నాయనా, కుమారా, నీధైర్యసాహసమునకు మెచ్చితిని. నీవేరాజ్యమున కీర్తి వహించగల పుత్రుడవు నేను నిన్ను పెట్టినకష్టములకు నన్ను మన్నింపుము. ఈరాజు మన రాజ్యమును గెలుచుకొని నీవు వచ్చువరకు మమ్ముల నిందుండ సెలవిచ్చినందున, నీవు వారిని మన్నించి వారి రాజ్యమును వారికే యిచ్చి పంపుమని నుడివెను. సుందరుడు తండ్రియానతి మీరక తండ్రిచెప్పినట్లు చేసెను.

సుందరుడు తన వివాహమునకు శుభముహూర్తమును బెట్టించి సకలరాజులకు వివాహపత్రికల నంపి, తనపట్టణ మలంకరింప నుత్తరవిచ్చెను. తనకు కాగితమిచ్చిన బీదబ్రాహ్మణుని రప్పించి, అర్ఘ్యపాదలచే పూజించి, యీకాగితమువలన గలిగినకథనుదెల్పి, మీవలన నేను ధన్యుడనైతిని. నేను మీకొకగ్రామమును యిచ్చెదను. మీరు దానినిగైకొని మీజీవితమును సుఖముగాజరుపుకొనుడనిజెప్పి గ్రామమును వ్రాసియిచ్చి వారిచేతనే తండ్రిగారికిని, సహోదరుల కిద్దరికిని, చెరి యొక్కొక్కపట్టణమును పట్టాభిషేకం బొనర్చి, తానొక పట్టణమును గైకొని సకలరాజులును విచ్చేయ శుభలగ్నమున సుందరవతిని, కమలవతిని, వకులవతిని వివాహమాడి, వచ్చిన రాజులకు మర్యాదలొసగి పంపి బీదబ్రాహ్మణునికి వస్త్రాభరణాదు లిచ్చి పంపి, తా నేకచక్రాధిపతియై బ్రాహ్మణు డిచ్చిన

తొమిమిది నీతివాక్యములను వదలక, నలుగురి భార్యలతో సకల భోగములనుభవించుచు సుఖమై యుండెను.

ఆర్యులారా !

చూచితిరే యీకథయందుగల ఆరు నీతివాక్యములను యెల్లరును మరువక శరీరమును పోషించుచు, యీపుస్తకమునందు గల ప్రాతఃకాలబోధ, మరణబోధ, స్త్రీబోధ, పురుషబోధ, కుటుంబబోధ, శరీర బోధలను తప్పక యనుష్ఠింపుచు, దుష్టకార్యములను జేయక, యీ నాటకమునందుగల భక్తిమార్గమును గ్రహించి, యిహలోక సుఖములను వదలి పరలోక మోక్షమును బొందుటకై వదలక భగవద్ధ్యానము జేయుదురని మీపాదారవిందములకు నమస్కరించుచు విరమించుచున్నాడను.

ఇట్లు,

కె. సి. మునుస్వామినాయుడు.

శ్రీ భ క్త వి శో బా నా ట క ము

స ం పూ ర్ణ ము.

---

మంగళం. మంగళం. మంగళం.

---

చంద్రికాప్రెస్సు, చాకలపేట, చెన్నపురి—1934.